# सुमन हिन्दी व्याकरण

( तेलुगु )



लेखक

एस. एम. गोविन्दराज

-4/-

प्रकाशक

एस. एम. गोविन्दराज

नं० 22, पि. एम. गली, पुदुप्पेट

गुडियात्तम

 : : [ दाम 2-00

# लेखक की ओर से

यह सुमन हिन्दी व्याकरण बडी कोशिश करके सरल ढंग मे तैयार किया गया है। इसमें हिन्दी के सभी व्याकरण के नियम समाये हैं। नये ढग की खोज करके चालीस भागों में लिखा गया है। इसके अद्भुत व्याकरण के नियमो और उदाहरणों के पढने मात्र से इस व्याकरण का महत्व आप ही जान सकते हैं। जो इसे पढ़ते हैं, वे हिन्दी में निपुण बन जायेंगे। उनके मुँह से व्याकरण की झडी लगेगी। इसमें शक नही है कि वे खुद लेखों और कथाओं के लिखने में भी बेजोड निकलेंगे। यही इसकी विशेषता है।

आशा है कि हाईस्कूल और कालेज के विद्यार्थी ही नही बल्कि अन्य सभी लोग इसे पढ कर ज़रूर लाभ उठा सकेंगे। पहले पहल आंध्र प्रदेश में ही इस व्याकरण को प्रकाशित करने की प्रबल इच्छा हुई। आखिर मेरी इच्छा पूरी हुई।

मै आशा करता हूँ कि आंध्र प्रदेशके भाई और बहनें इसका सहारा देकर मेरा उत्साह बढ़ा देंगी जिससे अन्य प्रदेशों में भी इसका प्रकाशन हो। यह तो पहला संस्करण है। शिक्षित लोगों से मेरी विनीत प्रार्थना यह है कि अगर इसमें कोई गलती हो तो कृपा करके मुझे सूचित करें जिससे अगले संस्करण में उनको सुधारने की कोशिश करूँ। इसके लिये मै आजीवन आप लोगोंका कृतज्ञ मानूँगा।

लेखक.

# అంజలి.

ఈ సుమణి హిందీ వ్యాకరణము భగీరథప్రయత్నముచే సులభ శైలిలో వ్రాయబడియున్నది. దీనియందు హిందీలోని వ్యాకరణ నియమములన్నియు నిమిడియున్నవి ఈ పుస్తకము క్రొత్తనియమములచే నలువది భాగములుగా వ్రాయబడియున్నది. దీని యద్భుత వ్యాకరణ నియమములు, ఉదాహరణములు చదివినంతమాత్రమున, ఈ వ్యాకరణముయొక్క గొప్పతనమును మీరే గ్రహింపగలరు దీనిని చదువువారు హిందీభాషయందు నిపుణులగుదురు వారి నోటి నుండి వ్యాకరణనియమముల వర్షము కురియ నారంభించును. వారు స్వయముగ హిందీయందు వ్యాసములు, కథలు వ్రాయుటయందును అందరిని మించియుందురనుటలో సందేహమేమాత్రము నుండదు. ఇదియే దీని విశేషము

హైస్కూలు, పాఠశాల, కళాశాలలలో విద్యనభ్యసించు విద్యార్థులేగాక ఇతరప్రజలుకూడ దీనిని చదివి తప్పక లాభముపొందగలరని నా నమ్మిక మొదట ఆంధ్రప్రదేశమునందే దీనిని ప్రచురింపజేయవలయునను నత్యంత అభిలాష నాలో ఏర్పడెను కడపట నా యభిలాష పూర్తికాజొచ్చెను.

ఆంధ్రప్రదేశములోని సోదర సోదరీమణులు ఈ పుస్తకము నాదరించి ఇతరప్రదేశములలోకూడ దీనిని ప్రచురింపజేయుటకు కావలసిన ప్రోత్సాహమును నా కిత్తురని నేను నమ్ముచున్నాను ఇదియే నా మొదటి ప్రచురణ. దీనియందేమైన తప్పులున్నచో దయచేసి నాకు తెలుపప్రార్థన మరుసటి ప్రచురణయందు వాటిని సరిదిద్ద ప్రయత్నించెదను. మీ ఈ కృతజ్ఞతను నేను నాజీవితపర్యంతము మరువను

ఇట్లు

గ్రంథకర్త.

# विषय सूची

# सुमन हिन्दी व्याकरण

## वर्तमानकाल

ధాతువుతో పుంలింగ ఏకవచనమునకు 'ता', పుంలింగ బహువచనమునకు, గౌరవమునకు, మధ్యమ పురుషమునకు 'ते', స్త్రీలింగ ఏకవచనమునకు, బహువచనమునకు, గౌరవమునకు 'ती' చేర్చిన వర్తమానకాలమగును.

ఏకవచనమునకు సహాయకక్రియ 'है', బహువచనమునకు, గౌరవమునకు 'हैं', ఉత్తమ పురుషమునకు 'हूँ', మధ్యమ పురుషమునకు 'हो' వచ్చును.

| धातु ధాతువు | क्रिया (वर्तमानकाल) క్రియ. |
|---|---|
| खेल = ఆడు | खेलता है = ఆటలాడుచున్నాడు |
| लिख = వ్రాయు | लिखता है = వ్రాయుచున్నాడు. |
| जा = పోవు | जाता है = పోవుచున్నాడు |
| खा = తిను | खाता है = తినుచున్నాడు |
| गा = పాడు | गाता है = పాడుచున్నాడు |

लड़का खेलता है । = బాలుడు ఆటలాడుచున్నాడు (పుంలింగ ఏకవచనము)

लड़के खेलते हैं । = బాలురు ఆటలాడుచున్నారు (పుంలింగ బహువచనము)

आप खेलते हैं। = తమరు ఆటలాడుచున్నారు. (గౌరవము)
तुम खेलते हो। = నీవు ఆటలాడుచున్నావు. (మధ్యమ పురుషము)

सरला लिखती है। = సరళ వ్రాయుచున్నది (స్త్రీలింగ ఏకవచనము)
मीना और गोमती लिखती हैं। = మీనయు, గోమతియు వ్రాయుచున్నారు (స్త్రీలింగ బహువచనము)
माताजी लिखती हैं। = తల్లిగారు వ్రాయుచున్నారు (స్త్రీలింగ గౌరవము).
मैं मदरसा जाता हूँ। నేను పాఠశాలకు పోవుచున్నాను (ఉత్తమ పురుషము)

वह खाता है। = అతడు తినుచున్నాడు (పుంలింగ ఏకవచనము)
वे खाते हैं। = వారు తినుచున్నారు (పుంలింగ బహువచనము)
वे जाते हैं। = వారు పోవుచున్నారు (గౌరవము)

यह गाता है। = ఇతడు పాడుచున్నాడు (పుంలింగ ఏకవచనము)
ये गाते हैं। = వీరు పాడుచున్నారు (పుంలింగ బహువచనము)
ये आते हैं। = వీరు వచ్చుచున్నారు (గౌరవము)
हम दौड़ते हैं। = మేము పరుగెత్తుచున్నాము. (ఉత్తమపురుష బహువచనము.

वह खेलती है। = ఆమె ఆటలాడు చున్నది (స్త్రీలింగ ఏకవచనము)
वे खेलती हैं। = వారు ఆటలాడుచున్నారు (స్త్రీలింగ బహువచనము)
वे बोलती हैं। = వారు మాటలాడుచున్నారు (స్త్రీలింగ గౌరవము)

यह पढ़ती है। = ఈమె చదువు చున్నది (స్త్రీలింగ ఏకవచనము)

ये पढ़ती हैं। = వీరు చదువుచున్నారు (స్త్రీలింగ బహువచనము)
ये पढ़ाती हैं। = వీరు చదివించుచున్నారు (స్త్రీలింగ గౌరవము)
मै उसको इनाम देती हूँ। = నేను అతనికి బహుమానము ఇచ్చుచున్నాను (ఉత్తమపురుష స్త్రీలింగము)
तुम उसको पुरस्कार देती हो। = నీవు అతనికి పారితోషికము ఇచ్చుచున్నావు. (మధ్యమపురుష స్త్రీలింగము)

**लोग** అను పదమునకు సామాన్యఅర్థము " ప్రజలు ". కాని దీనిని బహువచనమునకుకూడ ఉపయోగించవచ్చును. దీనిని **'तुम'**, **'हम'**, **'आप'**, **'वे'**, **'ये'** మొదలగు సర్వనామములతో మాత్రము చేర్చెదరు దీనిని నామవాచకములతో చేర్చకూడదు

तुम लोग कहाँ जाते हो? = మీరు ఎచ్చటికి పోవుచున్నారు ?
हम लोग सिनिमा जाते हैं। = మేము సినిమాకు పోవుచున్నాము
आप लोग किधर बैठते हैं? = తమరు ఎచ్చట కూర్చొనుచున్నారు ?
वे लोग इधर बैठते हैं। = వారు ఇచ్చట కూర్చొనుచున్నారు
ये लोग उधर बैठते हैं। = వీరు అచ్చట కూర్చొనుచున్నారు

## तात्कालिक वर्तमानकाल — भाग I.

ధాతువుతో పుంలింగ ఏకవచనమునకు **रहा,** పుంలింగ బహువచనమునకు, గౌరవమునకు, మధ్యమపురుషమునకు **रहे,** స్త్రీలింగ ఏకవచనమునకు, బహువచనమునకు, గౌరమునకు **रही,** చేర్చిన తాత్కాలిక వర్తమానకాల మగును.

वह खेल रहा है। = అతడు ఆటలాడుతూ ఉన్నాడు ఈ వాక్యమునందు खेल అను ధాతువుతో रहा చేర్చియుండుటను గమనింపుము.

लड़का खेल रहा है। = బాలుడు ఆటలాడుతూ ఉన్నాడు.
लड़के खेल रहे हैं। = బాలురు ఆటలాడుతూ ఉన్నారు
वे जा रहे हैं। = వారు పోతూ ఉన్నారు.

तुम खा रहे हो। = నీవు తింటూ ఉన్నావు
लड़की गा रही है। = బాలిక పాడుతూ ఉన్నది.
लड़कियाँ गा रही हैं। = బాలికలు పాడుతూ ఉన్నారు

ये काम कर रही हैं। = వీరు పని చేస్తూ ఉన్నారు
मैं पढ़ रहा हूँ। = నేను చదువుతూ ఉన్నాను
वह देख रहा है। = అతడు చూస్తూ ఉన్నాడు
वे देख रहे हैं। = వారు చూస్తూ ఉన్నారు.

यह बोल रहा है। = ఇతడు మాటలాడుతూ ఉన్నాడు
ये बोल रहे हैं। = వీరు మాటలాడుతూ ఉన్నారు
हम बैठ रहे हैं। = మేము కూర్చొనుచూ ఉన్నాము
आप सुन रहे हैं। = తమరు వినుచూ ఉన్నారు

वह लिख रही है। = ఆమె వ్రాయుచూ ఉన్నది
यह लिख रही है। = ఈమె వ్రాయుచూ ఉన్నది

तुम लोग कहाँ जा रहे हो? = మీరు ఎచ్చటికి పోవుచూ వున్నారు?
हम लोग सिनेमा जा रहे हैं। = మేము సినిమాకు పోతూవున్నాము
आप लोग किधर बैठ रहे हैं? = తమరు ఎచ్చట కూర్చొంటూఉన్నారు

वे लोग इधर बैठ रहे हैं । = వారు ఇచ్చట కూర్చొంటూ ఉన్నారు
ये लोग उधर बैठ रहे हैं । = వీరు అచ్చట కూర్చొంటూ ఉన్నారు.

వర్తమానకాలమునకును, తాత్కాలిక వర్తమానకాలమునకును భేదా యున్నది వర్తమానకాలమునందు పని జరుగుటలో కొంత సందేహమునకు తావిచ్చును. కాని తాత్కాలిక వర్తమానకాలమునందు పని అప్పుడే జరుగుచుండుటను మనము నిస్సందేహముగా గుర్తించ వచ్చును

लड़का खेलता है । = బాలుడు ఆటలాడుచున్నాడు. ఈ వాక్యమునందు "ఆటలాడుచున్నాడు" అను క్రియ పని జరుగుచున్నదా, లేక లేదా అనునది నిశ్చయపఱచుట లేదు

लड़का खेल रहा है । = బాలుడు ఆటలాడుచూఉన్నాడు. ఈ వాక్యమునందు పని ఇప్పుడే జరుగుచున్నదని నిశ్చయపఱచుచున్నది.

కొన్ని సమయములందు తాత్కాలిక వర్తమానకాలికమైన आ रहा, जा रहा మొదలగు క్రియలు భవిష్యత్కాల అర్థము నిచ్చును.

मै बाज़ार जा रहा हूँ । = నేను బజారునకు పోబోవుచున్నాను.
तुम किधर जा रहे हो ? = నీవు ఎచ్చటికి పోబోవుచున్నావు
वह घर जा रहा है । = అతడింటికి పోబోవుచున్నాడు
यह पाठशाला जा रहा है । = ఇతడు పాఠశాలకు పోబోవుచున్నాడు.

वे अभी जा रहे हैं। = వారిప్పుడే పోబోవుచున్నారు.
ये शाम को जा रहे हैं। = వీరు సాయంకాలము పోబోవుచున్నారు.
आप कब आ रहे हैं ? = తమరు ఎప్పుడు రాబోవుచున్నారు ?
हम आठ बजे आ रहे हैं। = మేము 8 గంటలకు రాబోవుచున్నాము
गौरी कितने बजे आ रही है ? = గౌరి ఎన్ని గంటలకు రాబోవుచున్నది
वह चार बजे आ रही है। = ఆమె 4 గంటలకు రాబోవుచున్నది
अब रेल गाडी आ रही है। = ఇప్పుడు రైలుబండి రాబోవుచున్నది.

---

## तात्कालिक वर्तमानकाल — भाग II.

వర్తమానకాలముతో పుంలింగ ఏకవచనమునకు **रहता,** పుంలింగ బహువచనమునకు, గౌరవమునకు, మధ్యమ పురుషమునకు **रहते,** స్త్రీలింగ ఏకవచనమునకు, బహువచనమునకు, గౌరవమునకు **रहती** చేర్చిన ఈ తాత్కాలిక వర్తమానకాలమగును. ఇట్లు కూడ ఉపయోగించవచ్చును. ఈ కాలమునకు గాను క్రింద ఇవ్వబడియుండు ఉదాహరణములలో ఒక విశేష అర్థము ఉండును. అది ఏమన ఇందులోని కర్త యగునది విశ్రాంతి లేక 'ఎల్లప్పుడును పనిచేయుట మనము గుర్తించవచ్చును.

वह पढ़ता रहता है। = వాడు చదువుచూ వుంటాడు.
वे पढ़ते रहते हैं। = వారు చదువుచూ వుంటారు.
वे गाते रहते हैं। = వారు పాడుచూ వుంటారు.
तुम सुनते रहते हो। = నీవు వింటూ వుంటావు.
यह लिखती रहती है। = ఈమె వ్రాస్తూ ఉంటుంది.

ये लिखती रहती हैं। = వీరు వ్రాస్తూ ఉంటారు.
ये खाती रहती हैं। = వీరు తింటూ ఉంటారు,
मै बैठता रहता हूँ। = నేను కూర్చునే ఉంటాను
हम दौड़ते रहते हैं। = మేము పరుగెత్తుతూనే ఉంటాము
मालती गाती रहती है। = మాలతి పాడుతూ ఉంటుంది
उमा और राधा नाचती रहती हैं। = ఉమయు, రాధయు నాట్య మాడుతూ ఉంటారు.
दादी उसे देखती रहती हैं। = అవ్వ దీనిని చూస్తూ ఉంటుంది.
मोहन जाता रहता है। = మోహనుడు పోతూ వుంటాడు
गोपाल और राम आते रहते हैं। = గోపాలుడు రాముడు వస్తూ వుంటారు
अध्यापक अपना काम करते रहते हैं। ఉపాధ్యాయులు తమ పని చేస్తూ వుంటారు
तुम लोग छाछ पीते रहते हो। = మీరు మజ్జిగ త్రాగుతూ వుంటారు
हम लोग पानी पीते रहते हैं। మేము నీళ్లు త్రాగుతూ ఉంటాము
आप लोग कपडे धोते रहते हैं। తమరు బట్టలు వుతుకుతూ వుంటారు
वे लोग तैरते रहते हैं। వారు ఈతకొట్టుతూ వుంటారు.
ये लोग नहाते रहते हैं। వీరు స్నానము చేస్తూ వుంటారు

## संदिग्ध वर्तमानकाल.

తాత్కాలిక వర్తమానకాలమునకు చేర్చు **रहा, रहे, रही** తో **होगा, होंगे, होगी, होंगी, हूँगा, होगे** చేర్చిన సందిగ్ధ వర్తమానకాలమగును.

వర్తమానకాలముతో క్రమముగా **होगा, होंगे** చేర్చినను సందిగ్ధ వర్తమానకాలమగును అనగా —

वह काम कर रहा होगा। = అతడు పనిచేస్తూ ఉండవచ్చును. ఈ వాక్యములో **रहा** తో **होगा** చేర్చి ఉండుటను గమనింపుము.

यह काम करता होगा। = ఇతడు పనిచేయుచుండవచ్చును ఈ వాక్యములో వర్తమానకాలికమైన **करता** తో **होगा** చేర ఉండుటను గమనింపుము

वह फल खा रहा होगा। = అతడు పండు తింటూ వుండవచ్చును
वह फल खाता होगा। = అతడు పండును తినుచుండవచ్చును
वे केले बेच रहे होंगे। = వారు అరటిపండ్లు అమ్ముతూవుండవచ్చును.
वे केले बेचते होंगे। = వారు అరటిపండ్లు అమ్ముచుండవచ్చును
यह पढ़ रही होगी। = ఈమె చదువుతూ వుండవచ్చును.
यह पढ़ती होगी। = ఈమె చదువుచుండవచ్చును.
ये पढ़ रही होंगी। = వీరు చదువుతూ వుండవచ్చును
ये पढ़ती होंगी। = వీరు చదువుచుండవచ్చును
मैं गा रहा हूँगा। = నేను పాడుతూ ఉండవచ్చును
मैं गाता हूँगा। = నేను పాడుచుండవచ్చును.
तुम सुन रहे होगे। = నీవు వింటూ వుండవచ్చును
तुम सुनते होगे। = నీవు వినుచుండవచ్చును
हम वीणा बजा रहे होंगे। = మేము వీణ వాయించుతూ వుండవచ్చును
हम वीणा बजाते होंगे। = మేము వీణ వాయించుచుండవచ్చును.

आप सो रहे होंगे। = తమరు నిద్రించుచూవుండవచ్చును.

आप सोते होंगे । = తమరు నిద్రించుచుండవచ్చును

लड़की दूध ला रही होगी। = బాలిక పాలు తెస్తూవుండవచ్చును.

लड़की दूध लाती होगी। = బాలిక పాలు తెచ్చుచుండవచ్చును

वह दूकान जा रही होगी। = ఆమె అంగడికి పోతూవుండవచ్చును

वह दूकान जाती होगी। = ఆమె అంగడికి పోవుచుండవచ్చును.

मैं सिनेमा देख रही हूँगी। = నేను సినిమా చూస్తూవుండవచ్చును

मैं सिनेमा देखती हूँगी। = నేను సినిమా చూచుచుండవచ్చును

तुम चावल खरीद रही होगी। = నీవు బియ్యము కొంటూ వుండవచ్చును

तुम चावल खरीदती होगी। = నీవు బియ్యము కొనుచుండవచ్చును.

तुम लोग खा रहे होगे। = మీరు తింటూవుండవచ్చును

तुम लोग खाते होगे। = మీరు తినుచుండవచ్చును

हम लोग खेल रहे होंगे। = మేము ఆటలాడుతూవుండవచ్చును

हम लोग खेलते होंगे। = మేము ఆటలాడుచుండవచ్చును.

आप लोग बोल रहे होंगे। = తమరు మాటలాడుతూ వుండవచ్చును

आप लोग बोलते होंगे। = తమరు మాటలాడుచుండవచ్చును

वे लोग देख रहे होंगे। = వారుచూస్తూ వుండవచ్చును.

वे लोग देखते होंगे। = వారు చూచుచుండవచ్చును.

ये लोग दौड़ रहे होंगे। = వీరు పరుగెత్తుతూ వుండవచ్చును.

ये लोग दौड़ते होंगे। = వీరు పరుగెత్తుచుండవచ్చును

# भविष्यत काल

అకారాంత ధాతువులకు పుంలింగ ఏకవచనమునకు **एगा**, పుంలింగ బహువచనమునకు, గౌరవమునకు, ఉత్తమపురుష బహువచనమునకు **एँगे**.

ఆకారాంత ధాతువులతో పుంలింగ ఏకవచనమునకు **यगा येगा**, పుంలింగ బహువచనమునకు, గౌరవమునకు, ఉత్తమపురుష బహువచనమునకు **येंगे**, ఉత్తమపురుష ఏకవచనమునకు, అకారాంతములును, ఆకారాంతములును రెండువిధములగు ధాతువులతో **ऊँगा**, మధ్యమపురుష ఏకవచనమునకు, బహువచనమునకు **ओगे**, చేర్చిన భవిష్యత్కాలమగును.

స్త్రీ లింగమునకు **गी** చేర్చవలయును

| अकार धातुएँ (अदीर्घ धातुएँ)<br>అకారాంత ధాతువులు | | आकार धातुएँ (दीर्घ धातुएँ)<br>ఆకారాంత ధాతువులు | |
|---|---|---|---|
| कर<br>खेल<br>पढ<br>लिख<br>बैठ | ఈ ధాతువులలో రెండవ అక్షరములయందు 'అ' శబ్దము ధ్వనిస్తుంది గమనింపుము. | आ<br>जा<br>खा<br>सो | ఈ ధాతువులలో ఆకారము ఓకారము ధ్వనిస్తుంది. గమనింపుము |
| | | सिखा, ले, पी, दे | |

| | |
|---|---|
| कर + एगा = करेगा | आ + यगा = आयगा |
| कर + एँगे = करेंगे | आ + येगा = आयेगा |
| खेल + एगा = खेलेगा | आ + येंगे = आयेंगे |
| खेल + एँगे = खेलेंगे | जा + यगा = जायगा |

पढ़ + एगा = पढ़ेगा

पढ़ + एंगे = पढ़ेंगे

लिख + एगा = लिखेगा

लिख + एंगे = लिखेंगे

बैठ + एगा = बैठेगा

बैठ + एंगे = बैठेंगे

कर + ऊँगा = करूँगा

कर + ओगे = करोगे

खेल + ऊँगा = खेलूँगा

खेल + ओगे = खेलोगे

पढ़ + ऊँगा = पढ़ूँगा

पढ़ + ओगे = पढ़ोगे

लिख + ऊँगा = लिखूँगा

लिख + ओगे = लिखोगे

बैठ + ऊँगा = बैठूँगा

बैठ + ओगे = बैठोगे

जा + येगा = जायेगा

जा + येंगे = जायेंगे

खा + यगा = खायगा

खा + येगा = खायेगा

खा + येंगे = खायेंगे

सो + यगा = सोयगा

सो + येगा = सोयेगा

सो + येंगे = सोयेंगे

सिखा + यगा = सिखायगा

सिखा + येगा = सिखायेगा

सिखा + येंगे = सिखायेंगे

आ + ऊँगा = आऊँगा

आ + ओगे = आओगे

जा + ऊँगा = जाऊँगा

जा + ओगे = जाओगे

खा + ऊँगा = खाऊँगा

खा + ओगे = खाओगे

सो + ऊँगा = सोऊँगा

सो + ओगे = सोओगे

सिखा + ऊँगा = सिखाऊँगा

सिखा + ओगे = सिखाओगे

ले + ऊँगा = लूँगा

ले + ओगे = लोगे

पी + ऊँगा = पिऊँगा

पी + ओगे = पिओगे

दे + ऊँगा = दूँगा

दे + ओगे = दोगे

ले + येगा = लेगा

ले + येंगे = लेंगे

पी + येगा = पियेगा

पी + येंगे = पियेंगे

दे + येगा = देगा

दे + येंगे = देंगे

## स्त्री लिंग

| | |
|---|---|
| कर + एगी = करेगी | लेगी, लेंगी |
| कर + ऐंगी = करेंगी | पियेगी, पियेंगी |
| आ + ऊँगी = आऊँगी | देगी, देंगी |
| आ + ओगी = आओगी | |

यह काम करेगा। = ఇతడు పనిచేయును.
ये काम करेंगे। = వీరు పనిచేయుదురు.
आप गेंद खेलेंगे। = తమరు బంతి ఆడెదరు.
हम फुटबाल खेलेंगे। = మేము ఫుట్‌బాల్ ఆడుదుము
मैं पाठ पढ़ूँगा। = నేను పాఠము చదువుదును.
तुम अखबार पढोगे। = నీవు వార్తాపత్రిక చదువుదువు
तुम लोग खत पढोगे। = మీరు జాబుచదువుదురు.
वह क्या काम करेगी? = ఆమె ఏమి పనిచేయును?
वे क्या काम करेंगी? = వారు ఏమి పని చేయుదురు
आप कब लिखेंगी? = తమరు ఎప్పుడు వ్రాయుదురు.
हम अभी लिखेंगी। = మేము ఇప్పుడే వ్రాయుదుము
मैं यह काम करूँगी। = నేను ఈ పని చేయుదును
तुम क्या काम करोगी? = నీవు ఏమి పని చేయుదువు?
तुम लोग किधर खेलोगी? = మీరు ఎచ్చట ఆడుదురు?
वह आज आयेगा। = అతడు ఈ రోజు వచ్చును
वे भी आज आयेंगे। = వారుకూడ ఈ రోజువచ్చెదరు.
ये आम खायेंगे। = వీరు మామిడిపండ్లు తినెదరు.
हम अनार खायेंगे। = మేము దానిమ్మ పండ్లను తినెదము

मै कुछ देर बाद सोऊँगा। = నేను కొంత సేపుండి నిద్రించెదను.
तुम कब सोओगे ? = నీవు ఎప్పుడు నిద్రించెదవు?
तुम लोग कहाँ सोओगे ? = మీరు ఎచ్చట నిద్రించెదరు ?

मै उसमें से एक हीरा लूँगा। = నేను దానిలోనుంచి ఒక వజ్రము తీసికొందును

मै शरबत पिऊँगा। = నేను పానకము త్రాగుదును.
मै उसको गुलाब दूँगा। = నేను అతనికి రోజా పుష్పము ఇచ్చెదను

यह भात खायेगी। = ఈమె అన్నము తినును
ये भात खायेंगी। = వీరు అన్నము తిందురు

आप हिन्दी सिखायेंगी। = తమరు హిందీ నేర్పెదరు
हम तेलुगु सिखायेंगी। = మేము తెలుగు నేర్పెదము

मै झट आऊँगी। = నేను వెంటనే వచ్చెదను.
तुम देर करके आओगी। = నీవు ఆలస్యముగా వచ్చెదవు
तुम लोग धीरे धीरे आओगी। = మీరు మెల్ల మెల్లగా వచ్చెదరు.

यह कल मदरास आयगा। = అతడు రేపు మదరాసునకు వచ్చును
यह परसों दिल्ली जायगा। = ఇతడు ఎల్లుండి ఢిల్లీకి పోవును.

तुम लोग नाच देखोगे। = మీరు నాట్యము చూచెదరు.
हम लोग गाना सुनेंगे। = మేము పాట వినెదము
आप लोग शरबत पियेंगे। = తమరు పానకము త్రాగుదురు.
वे लोग हाथी पर चढेंगे। = వారు ఏనుగుపై ఎక్కెదరు
ये लोग गधे पर बैठेंगे। = వీరు గాడిదపై కూర్చొనెదరు

तुम लोग घडी दिखाओगे। = మీరు గడియారము చూపింతురు
हम लोग गाडी चलायेंगे। = మేము బండి నడుపుదుము

आप लोग महल बनायेंगे । = తమరు భవనము కట్టుదురు.
वे लोग वीणा बजायेंगे । = వారు వీణ వాయించెదరు.
ये लोग कथा सुनायेंगे । = వీరు కథ చెప్పుదురు.

ఈ **येगा, येंगे** కు బదులుగా ఈ **एगा, एंगे** కూడ ఉపయోగించవచ్చును

| | |
|---|---|
| जायेगा | जायेंगे |
| जाएगा | जाएंगे |

## संभाव्य भविष्यतकाल

భవిష్యత్కాల క్రియ యందు కట్టకడపట వచ్చునట్టి వంటి **गा, गे, गी** లను తీసివేసిన సంభావ్య భవిష్యత్కాల మగును. దీనిని ఆజ్ఞ, అనుమతి, కోరిక, ఉద్దేశ్యము, పరత్తు, సందేహము, సంభావన మొదలగు అర్థములను సూచించుటకు ఉపయోగించెదము.

उदाहरण :

**आज्ञा —**

आप दिन में न सोयें । = తమరు పగటిలో నిద్రింపకుడు.
वह यह काम न करे । = అతడీ పనిని చేయరాదు.
कल रामू घर न जाय । = రేపటికి రాముడు ఇంటికి పోరాదు.

**अनुमति —**

क्या मैं अब स्कूल जाऊँ ? = నేనిప్పుడు పాఠశాలకు పోదునా ?
मैं भी उसके साथ जाऊँ ? = నేనుకూడ అతనితో పోదునా?

मै आप से एक भेद पूछूँ ? = నేను మిమ్ములను ఒక రహస్య మడుగుదునా ?

इच्छा —

भगवान उसकी भलाई करे ! = భగవంతుడు అతనికి మేలుచేయు గాక !

उसके एक बच्चा हो ! = అతని కొక బిడ్డ కలుగు గాక !

आप हमेशा नीरोग रहें ! = తమరెల్లప్పుడు ఆరోగ్యవంతులుగ నుందురు గాక !

उद्देश्य —

मै खूब पढ़ूँ तो होशियार बनूँगा । = నేను బాగుగా చదివినచో తెలివిగలవాడ నగుదును.

आप रुपये दें तो अभी चलूँगा । = తమరు డబ్బిచ్చినచో ఇప్పుడే వెళ్ళెదను.

शरत —

वह आवे तो उससे यह बात कह भेजो । = అతడు వచ్చినచో అతనికి ఈ విషయము చెప్పి పంపుము.

वे आयें तो मुझे न बुलाओ । =వారు వచ్చినచో నన్ను పిలువవద్దు.

संदेह —

कौन जाने वे कब आयेंगे ? = వారెప్పుడు రాగలరో ఎవరెరుగుదురు ?

भगवान जाने वह किधर है ? =వాఁడెచ్చట ఉన్నాడో భగవంతుని కెరుక !

संभावना —

गाडी न मिले तो वह कैसे जायगा ? = బండి దొరకనిచో వాడెట్లు పోవును ?

नौकरी न मिले तो वह कैसे जियेगा ? = ఉద్యోగము లభించక పోయినచో వాడెట్లు బ్రతుకగలడు ?

పై ఉదాహరణ వాక్యములలో స్థూలాక్షరములు గల క్రియలందు गा, गे, गी లను తీసివేసియుండుటను గమనింపుము.

## भूतकाल

అకారాంత ధాతువులో పుంలింగ ఏకవచనమునకు, ఉత్తమపురుష ఏకవచనమునకు, आ, పుంలింగ బహువచనమునకు, గౌరవమునకు, ఉత్తమ పురుష బహువచనమునకు, మధ్యమ పురుషమునకు ए, స్త్రీలింగ ఏకవచనమునకు ई, స్త్రీలింగ బహువచనమునకు, గౌరవమునకు, ఉత్తమపురుష బహువచనమునకు ईं చేర్చవలెను

ఆకారాంత ధాతువులో పుంలింగ ఏకవచనమునకు, ఉత్తమపురుష ఏకవచనమునకు या, పుంలింగ బహువచనమునకు, గౌరవమునకు, ఉత్తమపురుష బహువచనమునకు ये, స్త్రీలింగ ఏకవచనమునకు यी, స్త్రీలింగ బహువచనమునకు, గౌరవమునకు, ఉత్తమ పురుష బహువచనమునకు यीं చేర్చిన భూతకాలమగును.

అకారాంత ధాతువులు :—

अदीर्घ धातुएँ — बैठ, दौड, पढ़, लिख।

ఆకారాంత ధాతువులు :—

दीर्घ धातुएँ — गा, खा, ला, बना।

| अदीर्घ धातु के उदाहरण | दीर्घ धातु के उदाहरण |
|---|---|
| बैठ + आ = बैठा | गा + या = गाया |
| बैठ + ए = बैठे | गा + ये = गाये |
| बैठ + ई = बैठी | गा + यी = गायी |
| बैठ + ईं = बैठीं | गा + यीं = गायीं |
| दौड + आ = दौडा | खा + या = खाया |
| दौड + ए = दौडे | खा + ये = खाये |
| दौड + ई = दौडी | खा + यी = खायी |
| दौड + ईं = दौडीं | खा + यीं = खायीं |
| पढ + आ = पढा | ला + या = लाया |
| पढ + ए = पढे | ला + ये = लाये |
| पढ + ई = पढी | ला + यी = लायी |
| पढ + ईं = पढीं | ला + यीं = लायीं |
| लिख + आ = लिखा | बना + या = बनाया |
| लिख + ए = लिखे | बना + ये = बनाये |
| लिख + ई = लिखी | बना + यी = बनायी |
| लिख + ईं = लिखीं | बना + यीं = बनायीं |

ఈ క్రింది ధాతువులు పై నియమములను అనుసరించవు. కాన ఇవి క్రింది విధములుగా మారును

| | |
|---|---|
| कर + या = किया | पी + या = पिया |
| कर + ये = किये | पी + ये = पिये |
| कर + यी = की | पी + यी = पी |
| कर + यीं = कीं | पी + यीं = पीं |
| दे + या = दिया | जा + या = गया |
| दे + ये = दिये | जा + ये = गये |
| दे + यी = दी | जा + यी = गयी |
| दे + यीं = दीं | जा + यीं = गयीं |
| ले + या = लिया | हो + आ = हुआ |
| ले + ये = लिये | हो + ए = हुए |
| ले + यी = ली | हो + ई = हुई |
| ले + यीं = लीं | हो + ईं = हुईं |

క్రియలు రెండు విధములు. (1) అకర్మకక్రియ (2) సకర్మకక్రియ. కర్మను ఆశించనటువంటి క్రియను అకర్మకక్రియ యనియు, కర్మను ఆశించునటువంటి క్రియను సకర్మకక్రియ యనియు అందురు. ఒక వాక్యమునందు అకర్మకక్రియను కనిపెట్టవలయునన్న మనము రెండు ప్రశ్నలను జ్ఞప్తియందుంచుకొనవలయును. (1) ఏమిః (2) దేనిని ? ఈ ప్రశ్నలకు బదులు రాకపోయినచో ఆ వాక్యమునందు కర్మ లేదని తెలిసికొనవలయును. అట్లు కర్మలేనిచో దానిని అకర్మక క్రియ అందురు.

భూతకాలమునందు క్రియ అకర్మకమైనచో కర్తతో **ने** ప్రత్యయము చేర్చకూడదు. కావున ఇప్పుడు క్రియ కర్త ననుసరించి మారుచుండును. కర్త పుంలింగ ఏకవచనముగా నుండిన క్రియకూడ పుంలింగ ఏకవచనముగానుండును; పుంలింగ బహువచనముగానుండిన క్రియకూడ పుంలింగ బహువచనముగా నుండును, స్త్రీలింగ ఏకవచనముగా నుండిన క్రియకూడ స్త్రీలింగ ఏకవచనముగా నుండును। బహువచనముగానుండిన క్రియ కూడ స్త్రీలింగ బహువచనముగానుండును.

**राम मैदान में दौड़ा ।** = రాముడు మైదానమున పరుగెత్తెను. ఈ వాక్యమునందు కర్త (राम), క్రియ (दौड़ा), కర్మ ఈ వాక్యమునందు లేదు. ఏలన క్రియను తీసికొని పై రెండు ప్రశ్నలను ( ఏమి ? దేనిని ? ) వేసిన వాటికి జవాబు వచ్చుట లేదు ఎట్లనగా – రాముడు పరుగెత్తెను అను వాక్యమునందు ఏమి పరుగెత్తెను? దేనిని పరుగెత్తెను? అను ప్రశ్నలకు జవాబు వచ్చుటలేదు కావునసే ఈ వాక్యమునందు కర్మలేదని నిస్సందేహముగా తెలియుచున్నది. పై వాక్యము అకర్మకక్రియ గలదిగ నుండుటవలన క్రియ కర్తననుసరించి యుండుటను గమనింపుము.

## अकर्मक क्रिया

### सामान्य भूतकाल

वह ऊपर बैठा । = అతడు పైన కూర్చొనెను.
मै नीचे बैठा । = నేను క్రింద కూర్చొంటిని

वे तेज़ दौड़े । = వారు వేగముగ పరుగెత్తిరి

आप धीरे धीरे दौड़े । = తమరు మెల్ల మెల్లగా పరుగెత్తితిరి

हम अचानक दौड़े । = మేము అకస్మాత్తుగా పరుగెత్తితిమి.

तुम जल्दी जल्दी दौड़े । = నీవు త్వర త్వరగా పరుగెత్తితివి.

अनुसूया बोली । = అనసూయ మాటలాడెను

ललिता और राधा बोलीं । లలితా మరియు రాధా మాటలాడిరి

ये अभी बोलीं । = వీరు ఇప్పుడే మాటలాడిరి

हम कल बोलीं । = మేము నిన్న మాటలాడితిమి.

यह आज आया । = ఇతడు నేడు వచ్చెను

मै कल आया । = నేను నిన్న వచ్చితిని.

ये कल गये । = వీరు నిన్న పోయిరి.

आप परसों गये । = తమరు మొన్న వెళ్ళితిరి

हम बहुत देर सोये । = మేము చాలసేపు నిద్రపోతిమి.

तुम थोड़ी देर सोये । = నీవు కొంతసేపు నిద్రించితివి.

वह देर करके आयी । = ఆమె ఆలస్యముగా వచ్చెను

वे कब के आयीं । = వారు ఎప్పుడో వచ్చిరి

आप सात बजे गयीं । = తమరు ఏడు గంటలకు వెళ్ళితిరి

हम नौ बजे गयीं । = మేము తొమ్మిది గంటలకు వెళ్ళితిమి

సామాన్యభూతకాలముతో है, हैं, हूँ, हो అను చేర్చిన ఆసన్న భూతకాలమగును था, थे, थी, थीं లను చేర్చిన పూర్ణభూతకాలమగును होगा, होंगे, होगी, होंगी, हूँगा, होगे లను చేర్చిన సందిగ్ధ భూతకాలమగును.

## आसन्न भूतकाल.

वह ऊपर बैठा है। = అతడు పైన కూర్చొనియున్నాడు
मै नीचे बैठा हूँ। = నేను క్రింద కూర్చొనియున్నాను
वे तेज दौडे हैं। = వారు వేగముగ పరుగెత్తియున్నారు
आप धीरे धीरे दौडे हैं। = తమరు చాలమెల్లగ పరుగెత్తియున్నారు
हम अचानक दौडे हैं। = మేము తటాలున పరుగెత్తియున్నాము
तुम जल्दी जल्दी दौडे हो। = నీవు త్వరత్వరగా పరుగెత్తియున్నావు
अनुसूया बोली है। = అనసూయ మాటలాడియున్నది.
ललिता और राधा बोली हैं। = లలితయు, రాధయు మాటలాడియున్నారు
ये अभी बोली हैं। = వీరు ఇప్పుడే మాటలాడియున్నారు
हम कल बोली हैं। = మేము నిన్న మాటలాడియున్నాము.
यह आज आया है। = ఇతడు నేడు వచ్చియున్నాడు.
मै कल आया हूँ। = నేను నిన్న వచ్చియున్నాను
ये कल गये हैं। = వీరు నిన్న వెళ్ళియున్నారు
आप परसों गये हैं। = తమరు మొన్న వెళ్ళియున్నారు
हम बहुत देर सोये हैं। = మేము చాలసేపు నిద్రించియున్నాము
तुम थोडी देर सोये हो। = నీవు కొంతసేపు నిద్రించియున్నావు
वह देर करके आयी है। = ఆమె ఆలస్యముగా వచ్చియున్నది
वे कब के आयी है। వారు ఎప్పుడో వచ్చియున్నారు
आप सात बजे गयी हैं। తమరు ఏడు గంటలకు పోయియున్నారు
हम नौ बजे गयी हैं। = మేము తొమ్మిది గంటలకు వెళ్ళి ఉన్నాము.

# पूर्ण भूतकाल

वह ऊपर बैठा था। = అతడు పైన కూర్చొనియుండెను.
मैं नीचे बैठा था। = నేను క్రింద కూర్చొనియుంటిని
वे तेज दौड़े थे। = వారు వేగముగ పరుగెత్తియుండిరి.
आप धीरे धीरे दौड़े थे। = తమరు చాల మెల్లగా పరుగెత్తి యుంటిరి
हम अचानक दौड़े थे। = మేము తటాలున పరుగెత్తియుంటిమి
तुम जल्दी जल्दी दौड़े थे। = నీవు త్వరత్వరగా పరుగెత్తి యుంటివి
अनुसूया बोली थी। = అనసూయ మాటలాడి యుండెను.
ललिता और राधा बोली थीं। లలితయు, రాధయు మాటలాడి యుండిరి
ये अभी बोली थीं। = వీరు ఇప్పుడే మాటలాడియుండిరి.
हम कल बोली थीं। = మేము నిన్న మాటలాడియుంటిమి.
यह आज आया था। = ఇతడు నేడు వచ్చియుండెను.
मैं कल आया था। = నేను నిన్న వచ్చియుంటిని.
ये कल गये थे। = వీరు నిన్న వెళ్ళియుండిరి
आप परसों गये थे। = తమరు మొన్న వెళ్ళియుంటిరి
हम बहुत देर सोये थे। = మేము చాలసేపు నిద్రించియుంటిమి.
तुम थोड़ी देर सोये थे। = నీవు కొంతసేపు నిద్రించియుంటివి
वह देर करके आयी थी। = ఆమె ఆలస్యముగా వచ్చియుండెను
वे कब के आयी थीं। = వారు ఎప్పుడో వచ్చియుండిరి.
आप सात बजे गयी थीं। = తమరు ఏడు గంటలకు వెళ్ళియుంటిరి
हम नौ बजे गयी थीं। = మేము తొమ్మిది గంటలకు వెళ్ళియుంటిమి.

## संदिग्ध भूतकाल

वह ऊपर बैठा होगा। = అతడు పైన కూర్చొనియుండవచ్చును
मैं नीचे बैठा हूँगा। = నేను క్రింద కూర్చొనియుండవచ్చును

वे तेज दौडे होंगे। = వారు వేగముగ పరుగెత్తియుండవచ్చును
आप धीरे धीरे दौडे होंगे। = తమరు అతి మెల్లగ పరుగెత్తియుండవచ్చును
हम अचानक दौडे होंगे। = మేము తటాలున పరుగెత్తియుండవచ్చును.
तुम जल्दी जल्दी दौडे होगे। = నీవు త్వర త్వరగా పరుగెత్తియుండవచ్చును

अनुसूया बोली होगी। = అనసూయ మాటలాడియుండవచ్చును
ललिता और राधा बोली होंगी। = లలితయు, రాధయు మాటలాడియుండవచ్చును.

ये अभी बोली होंगी। = వీరు ఇప్పుడే మాటలాడియుండవచ్చును
हम कल बोली होंगी। = మేము నిన్న మాటలాడియుండవచ్చును.

यह आज आया होगा। ఇతడు నేడు వచ్చియుండవచ్చును
मैं कल आया हूँगा। = నేను నిన్న వచ్చియుండవచ్చును

ये कल गये होंगे। = వీరు నిన్న వెళ్ళియుండవచ్చును.
आप परसों गये होंगे। = తమరు మొన్న వెళ్ళియుండవచ్చును.

हम बहुत देर सोये होंगे। = మేము చాలసేపు నిద్రించియుండవచ్చును
तुम थोडी देर सोये होगे। = నీవు కొంతసేపు నిద్రించి యుండవచ్చును

वह देर करके आयी होगी । = ఆమె ఆలస్యముగ వచ్చియుండ వచ్చును

वे कब के आयी होंगी । = వారు ఎప్పుడో వచ్చియుండవచ్చును.

आप सात बजे गयी होंगी । = తమరు ఏడు గంటలకు వెళ్ళియుండ వచ్చును

हम नौ बजे गयी होंगी । = మేము తొమ్మిది గంటలకు వెళ్ళియుండ వచ్చును

## सकर्मक क्रिया

పైని మనము అకర్మక క్రియను గురించి చదివితిమి ఇప్పుడు సకర్మక క్రియను గురించి చదివెదము. ఈ సకర్మక క్రియ హిందీలో అతిముఖ్యముగ పరిగణింపబడుచున్నది. సకర్మక క్రియ అనగా కర్మను ఆశించు క్రియ యగును కావున సకర్మక వాక్యములలో కర్మను కనిపెట్టుట అతిముఖ్యము. కర్మను కని పెట్టుటకు అతి సులభమైన త్రోవ ఒకటియున్నది ఏది యన మనము ప్రతివాక్యమునందు క్రియను తీసికొని దానికి రెండు ప్రశ్నలను ప్రశ్నించవలయును. (1) ఏమి? (2) దేనిని? ఈ ప్రశ్నలకు జవాబు వచ్చిన అందు కర్మ తప్పక యుండునని తెలిసికొనవలయును అట్లు ఒక వాక్యమునందు కర్మయుండిన అది సకర్మక క్రియ యగును. క్రియ సకర్మకమైనచో కర్తతో **ने** ప్రత్యయము తప్పక చేర్చవలయును ఇట్లు **ने** ప్రత్యయము కర్తలో చేర్చినచో క్రియ కర్తననుసరించి మారుటలేదు క్రియ కర్మననుసరించి మారును కర్మ పుంలింగ ఏకవచనముగ

నుండిన క్రియకూడ పుంలింగ ఏకవచనముగనుండును పుంలింగ బహువచనముగనుండిన క్రియకూడ పుంలింగ బహువచనముగ నుండును, స్త్రీలింగ ఏకవచనముగనుండిన క్రియకూడ స్త్రీలింగ ఏకవచనముగనుండును. స్త్రీలింగ బహువచనముగనుండిన క్రియ కూడ స్త్రీలింగ బహువచనముగనుండును

## उदाहरण :

### सामान्य भूतकाल

गोपाल ने फल खाया। = గోపాలుడు పండును తినెను ఈ వాక్యమునందు కర్మయున్నది గోపాలుడు ఏమి తినెను ? దేనిని తినెను? అను ప్రశ్నకు 'పండును' అని జవాబు వచ్చుచున్నది గదా! దానినే కర్మయందుము కావున కర్తతో 'ने' ప్రత్యయము చేర్చియుండుటను చూడుము. ఒక సకర్మక వాక్యము నందు కర్మయుండినను లేక మరిగియుండినను తప్పక 'ने' ప్రత్యయము చేర్చవలయును. పై చెప్పిన వాక్యమునందు కర్మ (फल) వచ్చియున్నది. దీనిని గమనింపుము.

गोपाल ने खाया। = గోపాలుడు తినెను ఈ వాక్యము నందు కర్మమరిగియున్నది. గోపాలుడు ఏమి తినెను ? దేనిని తినెను ? అను ప్రశ్నలకు పండును తినెను, రొట్టెను తినెను, అన్నము తినెను, మిఠాయితినెను అని ఎన్నో జవాబులు వచ్చు చున్నవి అట్లు బదులువచ్చిన చాలును అట్లు బదులు వచ్చునటు వంటి కర్మ వాక్యమునందు ఉండినను, లేక మరిగియుండినను కర్తతో 'ने' ప్రత్యయము చేర్చవలయునని తప్పక జ్ఞప్తి

యించుకొనవలయును. అనేకులు ఎచ్చటెచ్చట 'ने' ప్రత్యయము చేర్పవలయునో తెలిసికొనక కన్నులు మూసికొని ఇష్టము వచ్చినచోట 'ने' ప్రత్యయముచేర్చి హిందీని పాడుచేయుచున్నారు. కావున దీనిని బాగుగ తెలిసికొనుట అతిముఖ్యము.

**लड़की ने आम खाया।** = బాలిక మామిడిపండును తినెను ఈ వాక్యమునందు కర్మ (आम) పుంలింగ ఏకవచనముగనుండుట వలన క్రియకూడ (खाया) పుంలింగ ఏకవచనముగ వచ్చుటను గమనింపుము.

**लड़की ने दो आम खाये।** = బాలిక రెండు మామిడి పండ్లను తినెను ఈ వాక్యమునందు కర్మ (दो आम) పుంలింగ బహువచనముగ నుండుటవలన క్రియకూడ (खाये) పుంలింగ బహువచనముగ వచ్చుటను గమనింపుము.

**नन्दगोपाल ने रोटी खायी।** = నందగోపాలుడు రొట్టెను తినెను. ఈ వాక్యమునందు కర్మ (रोटी) స్త్రీలింగ ఏకవచనముగ నుండుటవలన క్రియకూడ (खायी) స్త్రీలింగ ఏకవచనముగ నుండుటను గమనింపుము.

**नन्दगोपाल ने रोटियाँ खायीं।** = నందగోపాలుడు రొట్టెలను తినెను. ఈ వాక్యమునందు కర్మ (रोटियाँ) స్త్రీలింగ బహువచనముగ నుండుటవలన క్రియకూడ (खायीं) స్త్రీలింగ బహువచనముగ వచ్చుటను గమనింపుము.

**राम ने घोड़ा देखा।** = రాముడు గుఱ్ఱమును చూచెను. ఈ వాక్యమునందు కర్మ (घोड़ा) పుంలింగ ఏకవచనముగ

నుండుటవలన క్రియకూడ (देखा) పుంలింగ ఏకవచనముగ వచ్చు టను గమనింపుము.

राम ने दो घोड़े देखे। = రాముడు రెండు గుఱ్ఱములను చూచెను ఈ వాక్యమునందు కర్మ (घोड़े) పుంలింగ బహు వచనముగ నుండుటవలన క్రియకూడ (देखे) పుంలింగ బహు వచనముగ వచ్చుటను గమనింపుము.

క్రింది సర్వనామములతో 'ने' ప్రత్యయము చేర్చిన ఈ విధముగ మారును.

| | |
|---|---|
| वह + ने = उसने | कौन + ने = किसने, किन्होंने। |
| यह + ने = इसने | जो + ने = जिसने, जिन्होंने। |
| वे + ने = उन्होंने | |
| ये + ने = इन्होंने | |

मैं ने खाया। = నేను తింటిని

मैं ने फल खाया। = నేను పండును తింటిని.

मैं ने तीन फल खाये। = నేను మూడు పండ్లను తింటిని.

तुम ने लिखा। = నీవు వ్రాసితివి.

तुम ने पाठ लिखा। = నీవు పాఠమును వ్రాసితివి.

तुम ने दो पाठ लिखे। = నీవు రెండు పాఠములను వ్రాసితివి.

उसने खरीदा = అతడు కొనెను.

उसने कपड़ा खरीदा = అతడు బట్టను కొనెను.

उसने कपड़े खरीदे। = అతడు బట్టలను కొనెను.

इसने देखा। = ఇతడు చూచెను
इसने फूल देखा। = ఇతడు పుష్పమును చూచెను.
इसने चार फूल देखे। = ఇతడు 4 పుష్పములను చూచెను.
उन्होंने बनाया। = వారు కట్టిరి
उन्होंने मकान बनाया = వారు భవనమును కట్టిరి
उन्होंने दो मकान बनाये। = వారు రెండు భవనములను కట్టిరి.
आप ने दिया। = తమరు ఇచ్చితిరి.
आप ने पैसा दिया। = తమరు పైసా ఇచ్చితిరి
आप ने पैसे दिये। = తమరు పైసాలను ఇచ్చితిరి
हमने पकड़ा। = మేము పట్టుకొంటిమి
हमने मोर पकड़ा। = మేము నెమిలిని పట్టుకొంటిమి
हमने तीन मोर पकड़े। = మేము మూడు నెమిళ్లను పట్టుకొంటిమి
किसने मारा? = ఎవరు కొట్టిరి?
किसने कुत्ता मारा? = ఎవరు కుక్కను కొట్టిరి?
किसने कुत्ते मारे? = ఎవరు కుక్కలను కొట్టిరి?
जिसने यह किया वह होशियार है। = దీనిని చేసినవాడు తెలివిగలవాడు
जिसनें यह काम किया वह भी होशियार है। = ఈ పనిని చేసినవాడు కూడ తెలివిగలవాడు
जिसने ये काम किये वह भी होशियार है। ఈ పనులను చేసినవాడు కూడ తెలివిగలవాడు

### आसन्न भूतकाल.

मैं ने लिखा है। = నేను వ్రాసియున్నాను
मै ने पाठ लिखा है। = నేను పాఠమును వ్రాసియున్నాను

मैं ने दो पाठ लिखे हैं। = నేను రెండు పాఠములను వ్రాసి యున్నాను

तुम ने देखा है। = నీవు చూచియున్నావు
तुम ने फ़ूल देखा है। = నీవు పుష్పమును చూచియున్నావు.
तुम ने चार फ़ूल देखे हैं। = నీవు నాలుగు పుష్పములను చూచి యున్నావు

उसने खाया है। = అతడు తినియున్నాడు
उसने फल खाया है। = అతడు పండును తినియున్నాడు
उसने तीन फल खाये हैं। = అతడు మూడు పండ్లను తిని యున్నాడు.

इसने दिया है। = ఇతడు ఇచ్చియున్నాడు
इसने पैसा दिया है। = ఇతడు పైసా ఇచ్చియున్నాడు.
इसने पैसे दिये हैं। = ఇతడు పైసాలను ఇచ్చియున్నాడు.

उन्होंने मारा है। = వారు కొట్టియున్నారు.
उन्होंने कुत्ता मारा है। = వారు కుక్కను కొట్టియున్నారు
उन्होंने कुत्ते मारे हैं। = వారు కుక్కలను కొట్టియున్నారు.

आप ने पकड़ा है। = తమరు పట్టుకొనియున్నారు
आप ने मोर पकड़ा है। = తమరు నెమిలిని పట్టుకొనియున్నారు
आप ने तीन मोर पकड़े हैं। = తమరు మూడు నెమిళ్లను పట్టు కొనియున్నారు

हमने खरीदा है। = మేము కొనియున్నాము.
हमने कपड़ा खरीदा है। = మేము బట్టను కొనియున్నాము
हमने कपड़े खरीदे हैं। = మేము బట్టలను కొనియున్నాము.

किसने बनाया है ? = ఎవరు కట్టియున్నారు?
किसने मकान बनाया है ? = ఎవరు భవనమును కట్టియున్నారు?
किसने दो मकान बनाये हैं ? = ఎవరు రెండు భవనములను కట్టి
యున్నారు ?

जिसने यह किया है, वह बेवकूफ है। = దీనిని చేసియున్నవాడు
బుద్ధిహీనుడు
जिसने यह काम किया है, वह भी बेवकूफ है। ఈ పనిని చేసియున్న
వాడుకూడ బుద్ధిహీనుడు
जिसने ये काम किये हैं, वह भी बेवकूफ है। = ఈ పనులను చేసి
యున్నవాడుకూడ బుద్ధిహీనుడు.

## पूर्ण भूतकाल

मैं ने पकड़ा था। = నేను పట్టుకొనియుంటిని
मैं ने मोर पकड़ा था। = నేను నెమిలిని పట్టుకొనియుంటిని.
मैं ने तीन मोर पकड़े थे। = నేను మూడు నెమిళ్లను పట్టుకొని
యుంటిని

तुम ने दिया था। = నీ విచ్చియుంటివి
तुम ने पैसा दिया था। = నీవు పైసా నిచ్చియుంటివి.
तुम ने पैसे दिये थे। = నీవు పైసాల నిచ్చియుంటివి.

उसने मारा था। = అతడు కొట్టియుండెను.
उसने कुत्ता मारा था। = అతడు కుక్కను కొట్టియుండెను.
उसने कुत्ते मारे थे। = అతడు కుక్కలను కొట్టియుండెను.

इसने खरीदा था। = ఇతడు కొనియుండెను.

इसने कपड़ा खरीदा था। = ఇతడు బట్టను కొనియుండెను.

इसने कपड़े खरीदे थे। = ఇతడు బట్టలను కొనియుండెను.

उन्होंने लिखा था। = వారు వ్రాసి యుండిరి.

उन्होंने पाठ लिखा था। = వారు పాఠమును వ్రాసియుండిరి

उन्होंने दो पाठ लिखे थे। = వారు రెండు పాఠములను వ్రాసి యుండిరి.

आप ने बनाया था। = తమరు కట్టియుంటిరి.

आपने मकान बनाया था। = తమరు భవనమును కట్టియుంటిరి.

आपने दो मकान बनाये थे। = తమరు రెండు భవనములను కట్టియుంటిరి.

हमने देखा था। = మేము చూచియుంటిమి

हमने फूल देखा था। = మేము పుష్పమును చూచియుంటిమి.

हमने चार फूल देखे थे। = మేము నాలుగు పుష్పములను చూచి యుంటిమి.

किसने खाया था? = ఎవరు తిని యుండెను

किसने फल खाया था? = ఎవరు పండును తినియుండెను

किसने तीन फल खाये थे? = ఎవరు మూడు పండ్లను తిని యుండెను.

जिसने यह किया था, वह मामूली आदमी है। = దీనిని చేసియుండిన వాడు సాధారణ మనుష్యుడు.

जिसने यह काम किया था, वह भी मामूली आदमी है। = ఈ పనిని. చేసియుండినవాడు కూడ సాధారణ మనుష్యుడు.

जिसने ये काम किये थे, वह भी मामूली आदमी है। = ఈ పనులను చేసియుండినవాడుకూడ సాధారణమైన మనుష్యుడు.

## संदिग्ध भूतकाल

मै ने दिया होगा । = నేను ఇచ్చి యుండవచ్చును.
मै ने पैसा दिया होगा । = నేను పైసా ఇచ్చి యుండవచ్చును.
मै ने पैसे दिये होंगे । = నేను పైసాలను ఇచ్చి యుండవచ్చును

उसने लिखा होगा । = అతడు వ్రాసి యుండవచ్చును
उसने पाठ लिखा होगा । = ఆతడు పాఠమును వ్రాసియుండ వచ్చును.
उसने दो पाठ लिखे होंगे । = అతడు రెండుపాఠములను వ్రాసి యుండివచ్చును

इसने बनाया होगा । = ఇతడు కట్టియుండవచ్చును
इसने मकान बनाया होगा । = ఇతడు భవనమును కట్టియుండవచ్చును
इसने दो मकान बनाये होंगे । = ఇతడు రెండు భవనములను కట్టి యుండవచ్చును.

उन्होंने देखा होगा । = వారు చూచియుండవచ్చును.
उन्होंने फूल देखा होगा । = వారు పుష్పమును చూచియుండ వచ్చును
उन्होंने चार फूल देखे होंगे । = వారు నాలుగు పుష్పములను చూచియుండవచ్చును

आप ने खरीदा होगा । = తమరు కొనియుండవచ్చును
आप ने कपडा खरीदा होगा । = తమరు బట్టను కొనియుండవచ్చును
आप ने कपडे खरीदे होंगे । = తమరు బట్టలను కొనియుండవచ్చును

हमने मारा होगा । = మేము కొట్టియుండవచ్చును.
हमने कुत्ता मारा होगा । = మేము కుక్కను కొట్టియుండ వచ్చును

हमने कुत्ते मारे होंगे । =మేము కుక్కలను కొట్టియుండవచ్చును

किसने पकड़ा होगा ? = ఎవరు పట్టుకొని యుండవచ్చును?

किसने मोर पकड़ा होगा? = ఎవరు నెమలిని పట్టుకొని యుండవచ్చును?

किसने तीन मोर पकड़े होंगे ? = ఎవరు మూడు నెమిళ్లను పట్టుకొని యుండవచ్చును?

जिसने यह किया होगा, वह बड़ा आदमी है। = ఇది చేసియుండు వాడు పెద్దమనుష్యుడు

जिसने यह काम किया होगा, वह भी बड़ा आदमी है। = ఈ పనిని చేసియుండువాడుకూడ పెద్ద మనుష్యుడు

जिसने ये काम किये होंगे, वह भी बड़ा आदमी है। ఈ పనులను చేసియుండువాడు కూడ పెద్దమనుష్యుడు

---

## अलग प्रयोग

इन्होंने बेचा । = వీరు అమ్మిరి.

इन्होंने बेचा है । = వీరు అమ్మియున్నారు.

इन्होंने बेचा था । = వీరు అమ్మియుండిరి

इन्होंने बेचा होगा । = వీరు అమ్మియుండవచ్చును

इन्होंने घर बेचा । = వీరు ఇల్లు అమ్మిరి

इन्होंने घर बेचा है । = వీరు ఇల్లు అమ్మియున్నారు

इन्होंने घर बेचा था । = వీరు ఇల్లు అమ్మియుండిరి

इन्होंने घर बेचा होगा । = వీరు ఇల్లు అమ్మియుండవచ్చును

इन्होंने दो घर बेचे । = వీరు రెండు ఇండ్లను అమ్మిరి.

इन्होंने दो घर बेचे हैं। = వీరు రెండు ఇండ్లను అమ్మియున్నారు
इन्होंने दो घर बेचे थे। = వీరు రెండు ఇండ్లను అమ్మియుండిరి
इन्होंने दो घर बेचे होंगे। = వీరు రెండు ఇండ్లను అమ్మియుండ వచ్చును.

कृष्ण ने लिखा। = కృష్ణుడు వ్రాసెను.
कृष्ण ने लिखा है। = కృష్ణుడు వ్రాసియున్నాడు.
कृष्ण ने लिखा था। = కృష్ణుడు వ్రాసియుండెను.
कृष्ण ने लिखा होगा। = కృష్ణుడు వ్రాసియుండవచ్చును

कृष्ण ने लेख लिखा। = కృష్ణుడు వ్యాసము వ్రాసెను
कृष्ण ने लेख लिखा है। = కృష్ణుడు వ్యాసము వ్రాసియున్నాడు
कृष्ण ने लेख लिखा था। = కృష్ణుడు వ్యాసము వ్రాసియుండెను
कृष्ण ने लेख लिखा होगा। = కృష్ణుడు వ్యాసము వ్రాసియుండ వచ్చును

कृष्ण ने दो लेख लिखे। = కృష్ణుడు రెండు వ్యాసములు వ్రాసెను.
कृष्ण ने दो लेख लिखे हैं। = కృష్ణుడు రెండు వ్యాసములు వ్రాసియున్నాడు
कृष्ण ने दो लेख लिखे थे। = కృష్ణుడు రెండు వ్యాసములు వ్రాసియుండెను.
कृष्ण ने दो लेख लिखे होंगे। = కృష్ణుడు రెండు వ్యాసములు వ్రాసియుండవచ్చును.

मनोरमा ने देखा। = మనోరమ చూచెను
मनोरमा ने देखा है। = మనోరమ చూచియున్నది.
मनोरमा ने देखा था। = మనోరమ చూచియుండినది.
मनोरमा ने देखा होगा। = మనోరమ చూచియుండవచ్చును

मनोरमा ने किला देखा । = మనోరమ కోటను చూచెను.
मनोरमा ने किला देखा है । = మనోరమ కోటను చూచి
యున్నది
मनोरमा ने किला देखा था । = మనోరమ కోటను చూచి
యుండినది.
मनोरमा ने किला देखा होगा । = మనోరమ కోటను చూచి
యుండవచ్చును

मनोरमा ने किले देखे । = మనోరమ కోటలను చూచెను.
मनोरमा ने किले देखे हैं । = మనోరమ కోటలను చూచియున్నది
मनोरमा ने किले देखे थे । = మనోరమ కోటలను చూచి
యుండినది
मनोरमा ने किले देखे होंगे । = మనోరమ కోటలను చూచి
యుండవచ్చును

సామాన్య భూతకాలములోని వాక్యములలో కర్త మరిగియుండినచో క్రియ ఎల్లప్పుడు పుంలింగ ఏకవచనముగ నుండును. ఇదేనియమము ఆసన్న, పూర్ణ, సందిగ్ధ భూతకాలములకు కూడ వర్తించును.

उसने पढ़ा । = అతడు చదివెను.
उन्होंने पढ़ा । = వారు చదివిరి.
इसने लिखा । = ఇతడు వ్రాసెను.
इन्होंने लिखा । = వీరు వ్రాసిరి

आप ने किया । = తమరు చేసితిరి.
हम ने किया । = మేము చేసితిమి.

मै ने देखा । = నేను చూచితిని.
तुम ने देखा । = నీవు చూచితివి.
लडकी ने गाया । = బాలిక పాడెను
लडकियों ने गाया । = బాలికలు పాడిరి
लडके ने खाया । = బాలుడు తినెను.
लडकों ने खाया । = బాలురు తినిరి
राम ने पिया । = రాముడు త్రాగెను.
राम और गोपाल ने पिया । = రాముడును గోపాలుడును త్రాగిరి

స్త్రీలింగ

## स्त्रीलिंग के उदाहरण

मै ने किताब खरीदी । = నేను పుస్తకమును కొంటిని
मै ने किताबें खरीदीं । = నేను పుస్తకములను కొంటిని
तुम ने घडी खरीदी । = నీవు గడియారమును కొంటివి.
तुम ने घडियाँ खरीदीं । = నీవు గడియారములను కొంటివి
उसने बिल्ली देखी । = అతడు పిల్లిని చూచెను.
उसने बिल्लियाँ देखीं । = అతడు పిల్లులను చూచెను.
उन्होंने लडकी देखी । = వారు బాలికను చూచిరి
उन्होंने लडकियाँ देखीं । = వారు బాలికలను చూచిరి
इसने गाय बेची । = ఇతడు ఆవును అమ్మెను.
इसने गायें बेचीं । = ఇతడు ఆవులను అమ్మెను.
इन्होंने टोकरी रखी । = వీరు గంపను ఉంచిరి.
इन्होंने टोकरियाँ रखीं । = వీరు గంపలను ఉంచిరి.

आप ने अंगूठी बनायी । = తమరు ఉంగరమును చేసితిరి,
आप ने अंगूठियाँ बनायीं । = తమరు ఉంగరములను చేసితిరి
हम ने कविता बनायी । = మేము పద్యమును రచించితిమి.
हम ने कवितायें बनायीं । = మేము పద్యములను రచించితిమి

लड़के ने पेटी चुरायी । = బాలుడు పెట్టెను దొంగలించెను
लड़कों ने पेटियाँ चुरायीं । = బాలురు పెట్టెలను దొంగలించిరి.
लड़की ने तसवीर देखी । = బాలిక పటమును చూచెను
लड़कियों ने तसवीरें देखीं । = బాలికలు పటములను చూచిరి.

---

मै ने घड़ी खरीदी है । = నేను గడియారమును కొనియున్నాను
मै ने घड़ी खरीदी थी । = నేను గడియారమును కొనియుంటిని
मै ने घड़ी खरीदी होगी । = నేను గడియారమును కొనియుండ వచ్చును.

तुम ने बिल्ली मारी है । = నీవు పిల్లిని కొట్టియున్నావు
तुम ने बिल्ली मारी थी । = నీవు పిల్లిని కొట్టియుంటివి.
तुम ने बिल्ली मारी होगी । = నీవు పిల్లిని కొట్టియుండవచ్చును

उसने पेटी चुरायी है । = అతడు పెట్టెను దొంగలించియున్నాడు.
उसने पेटी चुरायी थी । = అతడు పెట్టెను దొంగలించియుండెను
उसने पेटी चुरायी होगी । = అతడు పెట్టెను దొంగలించి యుండ వచ్చును

उन्होंने किताब खरीदी है । = వారు పుస్తకమును కొనియున్నారు
उन्होंने किताब खरीदी थी । = వారు పుస్తకమును కొనియుండిరి
उन्होंने किताब खरीदी होगी । = వారు పుస్తకమును కొనియుండ వచ్చును

इसने टोकरी रखी है। = ఇతడు గంపను ఉంచియున్నాడు
इसने टोकरी रखी थी। = ఇతడు గంపను ఉంచియుండెను.
इसने टोकरी रखी होगी। = ఇతడు గంపను ఉంచియుండవచ్చును

इन्होंने मुरगी देखी है। = వీరు కోడిని చూచియున్నారు
इन्होंने मुरगी देखी थी। = వీరు కోడిని చూచియుండిరి
इन्होंने मुरगी देखी होगी। = వీరు కోడిని చూచియుండవచ్చును.

आप ने कविता बनायी है। = తమరు పద్యమును రచించియున్నారు
आप ने कविता बनायी थी। = తమరు పద్యమును రచించియుంటిరి
आप ने कविता बनायी होगी। = తమరు పద్యమును రచించియుండ వచ్చును

हम ने गाय बेची है। = మేము ఆవును అమ్మియున్నాము
हम ने गाय बेची थी। = మేము ఆవును అమ్మియుంటిమి
हम ने गाय बेची होगी। = మేము ఆవును అమ్మియుండవచ్చును.

परशुराम ने लडकी देखी है। = పరశురాముడు బాలికను చూచి యున్నాడు.

परशुराम ने लडकी देखी थी। = పరశురాముడు బాలికను చూచి యుండెను.

परशुराम ने लडकी देखी होगी। = పరశురాముడు బాలికను చూచి యుండవచ్చును

राजेश्वरी ने अंगूठी बनायी है। = రాజేశ్వరి ఉంగరమును చేసి యున్నది
राजेश्वरी ने अंगूठी बनायी थी। = రాజేశ్వరి ఉంగరమును చేసి యుండినది.

राजेश्वरी ने अंगूठी बनायी होगी। = రాజేశ్వరి ఉంగరమును చేసి యుండవచ్చును

जयपाल ने किताब खरीदी है। = జయపాలుడు పుస్తకమును కొని యున్నాడు

जयपाल ने किताब खरीदी थी। = జయపాలుడు పుస్తకమును కొని యుండెను.

जयपाल ने किताब खरीदी होगी। = జయపాలుడు పుస్తకమును కొని యుండవచ్చును

कांता ने तसवीर देखी है। = కాంత పటమును చూచియున్నది

कांता ने तसवीर देखी थी। = కాంత పటమును చూచియుండినది.

कांता ने तसवीर देखी होगी। = కాంత పటమును చూచి యుండవచ్చును

భూతకాల వాక్యములలో (సామాన్య, ఆసన్న, పూర్ణ, సందిగ్ధ) క్రియ సకర్మకమైనచో క్రియ కర్మను అనుసరించి మారును అని పైన చెప్పబడియున్నది. కర్మలో వచ్చునటువంటి పదములు ఏది స్త్రీ లింగము? ఏది పుంలింగము? అని తెలిసికొనుట హిందీలో చాల కష్టము ఏలయన ఒక పదము తీసికొని ఆ పదము స్త్రీలింగమా? లేక పుంలింగమా? అని దృఢపరచుటకు హిందీలో ఏ నియమమును లేదు. దీనిని అనుభవముమీదనే తెలిసికొనవలయును. అయినప్పటికిని కర్మలో వచ్చుపదము స్త్రీలింగమా? లేక పుంలింగమా? అను సందేహమును పోగొట్టుటకు సులభమైనమార్గము ఒకటియున్నది. పైన

చెప్పబడిన వాక్యములలో కర్మతో ద్వితీయా విభక్తి "को" చేర్చిన క్రియ ఎల్లప్పుడును పుంలింగ ఏకవచనముగ నుండును

मोहन ने एक गाय खरीदी। = మోహనుడు ఒక ఆవును కొనెను. ఈ వాక్యమునందు కర్మ (गाय). ఇది స్త్రీలింగము. కాన క్రియకూడ (खरीदी) స్త్రీలింగ ఏకవచనముగ వచ్చి యున్నది, అయితే मोहन ने एक गाय को खरीदा। ఈ వాక్యము నందు కర్మ (गाय) తో को చేర్చినందువలన క్రియ (खरीदा) పుంలింగ ఏకవచనముగ వచ్చుటను గమనింపుము

गोपाल ने किताबें खरीदीं। = గోపాలుడు పుస్తకములను కొనెను ఈ వాక్యమునందు కర్మ किताबें ఇది స్త్రీలింగ బహు వచనము కావున క్రియకూడ (खरीदीं) స్త్రీలింగ బహువచన ముగ వచ్చుటను గమనింపుము गोपाल ने किताबों को खरीदा। అను వాక్యమునందు కర్మతో (किताबें) ద్వితీయా విభక్తి (को) చేర్చియుండుటవలన క్రియ పుంలింగ ఏకవచనముగనుండుటను గమనింపుము.

గమనిక — కర్మ స్త్రీలింగబహువచనముగ నుండినప్పటికిని అకారాంత నామవాచక బహువచన పదములతో విభక్తి ప్రత్యయము చేర్చిన ఆ నామవాచకపదములతో ओं కారము చేర్చవలయును ఉదా — किताबें + को = किताबों को। దీనిలో ओं కారముండుటను గమనింపుము.

उसने घडी को खरीदा। = అతడు గడియారమును కొనెను.
उसने घडी को खरीदा है। = అతడు గడియారమును కొనియున్నాడు.

उसने घड़ी को खरीदा था । = అతడు గడియారమును కొని యుండెను.

उसने घड़ी को खरीदा होगा । = అతడు గడియారమును కొని యుండవచ్చును

उसने घड़ियों को खरीदा । = అతడు గడియారములను కొనెను

उसने घड़ियों को खरीदा है । = అతడు గడియారములను కొని యున్నాడు.

उसने घड़ियों को खरीदा था । = అతడు గడియారములను కొని యుండెను.

उसने घड़ियों को खरीदा होगा । =అతడు గడియారములను కొని యుండవచ్చును.

मैं ने तसवीर को देखा । = నేను పటమును చూచితిని

मैं ने तसवीर को देखा है । = నేను పటమును చూచియున్నాను.

मैं ने तसवीर को देखा था । = నేను పటమును చూచియుంటిని

मैं ने तसवीर को देखा होगा । = నేను పటమును చూచియుండ వచ్చును.

उन्होंने टोकरी को रखा । = వారు గంపను పెట్టిరి

उन्होंने टोकरी को रखा है । = వారు గంపను పెట్టియున్నారు.

उन्होंने टोकरी को रखा था । = వారు గంపను పెట్టి యుండిరి

उन्होंने टोकरी को रखा होगा । = వారు గంపను పెట్టి యుండ వచ్చును

इन्होंने टोकरियों को रखा । = వీరు గంపలను పెట్టిరి

इन्होंने टोकरियों को रखा है । = వీరు గంపలను పెట్టియున్నారు.

इन्होंने टोकरियों को रखा था । = వీరు గంపలను పెట్టియుండిరి

इन्होंने टोकरियों को रखा होगा। = వీరు గంపలను పెట్టియుండ వచ్చును.

आपने गाय को मारा। = తమరు ఆవును కొట్టితిరి.
आपने गाय को मारा है। = తమరు ఆవును కొట్టియున్నారు.
आपने गाय को मारा था। = తమరు ఆవును కొట్టియుంటిరి.
आपने गाय को मारा होगा। = తమరు ఆవును కొట్టియుండ వచ్చును

हमने गायों को मारा। = మనము ఆవులను కొట్టితిమి.
हमने गायों को मारा है। = మనము ఆవులను కొట్టి యున్నాము
हमने गायों को मारा था। = మనము ఆవులను కొట్టి యుంటిమి
हमने गायों को मारा होगा। =మనము ఆవులను కొట్టియుండవచ్చును.

పై ఉదాహరణములలో घड़ी, तसवीर, टोकरी, गाय ఇవి స్త్రీలింగము వీటితో को చేర్చియుండుటవలన క్రియ పుంలింగ ఏకవచనముగనుండుటను గమనింపుము

ला, बोल, भूल ఇవి సకర్మక క్రియలుగ నుండినప్పటికిని ఇట్టివి వాక్యములయందు వచ్చునపుడు, సామాన్య, అసన్న, పూర్ణ, సందిగ్ధ భూతకాలములయందు కర్తకు ने ప్రత్యయము చేర్చకూడదు

मैं लाया = నేను తెచ్చితిని.
मैं न लाया = నేను తేలేదు.
मैं बोला = నేను మాటలాడితిని.
मैं न बोला = నేను మాటలాడ లేదు.

मै भूला = నేను మరచితిని.

मै न भूला = నేను మరువ లేదు

పైన సామాన్య భూతకాలమునకు మాత్రము ఉదాహరణములు ఇవ్వబడినవి.

ఏ చోటున కర్తతో నె ప్రత్యయము వచ్చును, ఏ చోటున కర్తతో నె ప్రత్యయము రాదు అను దానిని గురించి పైన చెప్పబడియున్నది అయినను ఇది మెదడును కలత చెందించునట్టి వ్యాకరణముగానుండుటవలన దీనిని బాగుగా జ్ఞప్తిలో ఉంచుకొనుటకు మరల సంగ్రహముగా చెప్పుచున్నాను. గమనింపుము

1. అకర్మక క్రియా ప్రయోగమునందు కర్తతో నె ప్రత్యయమురాదు. ఏ వాక్యములో ఏమి? దేనిని? అను ప్రశ్నలకు జవాబురాదో అది అకర్మక క్రియా ప్రయోగము అకర్మక క్రియా ప్రయోగమునందు క్రియ కర్తననుసరించి వచ్చును.

2 సకర్మక క్రియా ప్రయోగమున కర్తతో నె ప్రత్యయము వచ్చును ఏ వాక్యములో ఏమి? దేనిని? అను ప్రశ్నలకు జవాబువచ్చునో అది సకర్మక క్రియా ప్రయోగము. సకర్మ క్రియా ప్రయోగములో క్రియ కర్మననుసరించి వచ్చును. ఇచ్చట కర్తను గమనింప కూడదు

3. సకర్మక క్రియా ప్రయోగములో కర్మ మరిగి యుండిన క్రియ ఎప్పుడును పుంలింగ ఏకవచనముగానే

వచ్చును. ఇచ్చటకూడ కర్తను గమనింపకూడదు.

4. సకర్మక క్రియా ప్రయోగములో కర్మ స్త్రీలింగ ముగానుండి దానితో को ప్రత్యయముచేర్చిన క్రియ ఎప్పుడును పుంలింగ ఏకవచనముగానే వచ్చును. ఇచ్చటకూడ కర్తను గమ నింపకూడదు.

5 సకర్మకక్రియా ప్రయోగమునసే కర్తకు ने ప్రత్య యమువచ్చునని చెప్పబడియున్నది ఈ సకర్మక క్రియా ప్రయో గములో సామాన్య భూతకాలము, ఆసన్న భూతకాలము, పూర్ణభూతకాలము, సందిగ్ధ భూతకాలము అను ఈ నాల్గు కాలములలో మాత్రమే కర్తకు ने ప్రత్యయమువచ్చును. వర్తమాన కాలమునను భవిష్యత్కాలములోను కర్తకు ने ప్రత్యయము రాదు

భూతకాలములలో మాత్రము ఏది అకర్మకక్రియ ? ఏది సకర్మకక్రియ ? అనునది గమనింపవలెను.

## सकर्मक क्रिया ( प्रयोग )

| वर्तमानकाल | भविष्यतकाल |
|---|---|
| मै भात खाता हूँ। | मै भात खाऊँगा। |
| तुम फल खाते हो। | तुम फल खाओगे। |
| वह गोश्त खाता है। | वह गोश्त खायगा। |

ఈ ఉదాహరణములుకూడ సకర్మకక్రియా ప్రయోగములే. ఇందు కర్తతో ఎందుకు ने ప్రత్యయము రాలేదు? దీనికి ने ప్రత్యయము వచ్చునా? రాదు ఏలనగా ఇది వర్తమానకాల భవిష్యత్కాల సకర్మకక్రియాప్రయోగములు. ఇటువంటి వర్తమానకాల సకర్మకక్రియా ప్రయోగములందును భవిష్యత్కాల సకర్మకక్రియా ప్రయోగములందును ने ప్రత్యయమురాదు. ఐదవ భాగమునందు చెప్పిన నాలుగు కాలములలో మాత్రమే ने ప్రత్యయమువచ్చును.

---

## पुनः उदाहरण

| | कर्म लुप्त है | कर्म मौजूद है |
|---|---|---|
| (1) | उसने खाया। | उसने भात खाया। |
| | उसने खाया है। | उसने भात खाया है। |
| | उसने खाया था। | उसने भात खाया था। |
| | उसने खाया होगा। | उसने भात खाया होगा। |
| (2) | उन्होंने किया। | उन्होंने काम किया। |
| | उन्होंने किया है। | उन्होंने काम किया है। |
| | उन्होंने किया था। | उन्होंने काम किया था। |
| | उन्होंने किया होगा। | उन्होंने काम किया होगा। |

ఈ ఉదాహరణములలో మొదటి వరుసయందు కర్మ మరిగియున్నది (कर्म लुप्त है). రెండవ వరుసయందు కర్మయున్నది (कर्म मौजूद है). ఇటువంటి సకర్మక క్రియాప్రయోగ

మునందు సామాన్య భూతకాలము, ఆసన్న భూతకాలము, పూర్ణ భూతకాలము, సందిగ్ధభూతకాలము అను ఈ నాలుగు కాలములకు మాత్రము కర్తతో ने ప్రత్యయము వచ్చును. మరి ఏ చోటుననున్న ఈ ने ప్రత్యయము రాదు.

సకర్మక క్రియా ప్రయోగమునందు ఆసన్న భూతకాలములో मैं, तुम వీటికి సహాయక క్రియలైన हूँ, हो రాదు. ఈ రెంటికికూడ है మాత్రమే వచ్చును

मैं ने फल खाया है। ( हूँ రాదు )
तुम ने फल खाया है। ( हो రాదు )

---

## वर्तमानकालिक कृदंत

వర్తమానకాలిక క్రియతో నామవాచక పుంలింగ ఏకవచనమునకు हुआ, బహువచనమునకు हुए, స్త్రీలింగ ఏకవచనమునకు, బహువచనమునకు हुई చేర్చిన వర్తమానకాలిక కృదంతము ఏర్పడును

दौड़ता हुआ लड़का। = పరుగెత్తుచున్న బాలుడు. ఇచ్చట लड़का నామవాచక పుంలింగ ఏకవచనముగ నుండుటవల్ల दौड़ता అను వర్తమానకాలిక క్రియతో हुआ వచ్చుటను గమనింపుము.

दौड़ते हुए लड़के। = పరుగెత్తుచున్న బాలురు. ఇచ్చట लड़के నామవాచక పుంలింగ బహువచనముగ నుండుటవల్ల

दौड़ते అను వర్తమానకాలిక క్రియతో హుఏ వచ్చుటనుగమనింపుము.

दौड़ती हुई लड़की । = పరుగెత్తుచున్న బాలిక. ఇచ్చట लड़की నామవాచక స్త్రీలింగ ఏకవచనముగ నుండుటవల్ల दौड़ती అను వర్తమానకాలిక క్రియతో हुई వచ్చుటను గమనింపుము.

दौड़ती हुई लड़कियाँ = పరుగెత్తుచున్న బాలికలు. ఇచ్చట लड़कियाँ నామవాచక స్త్రీలింగ బహువచనముగనుండినను కూడ हुई వచ్చుటను గమనింపుము.

दौड़ता हुआ लड़का मेरा भाई है । = పరుగెత్తుచున్న బాలుడు నా సహోదరుడు.

दौड़ते हुए लड़के उसके भाई हैं । = పరుగెత్తుచున్న బాలుర వాని సహోదరులు.

दौड़ती हुई लड़की मेरी बहन है । = పరుగెత్తుచున్న బాలిక నా సహోదరి.

दौड़ती हुई लड़कियाँ उसकी बहनें हैं । = పరుగెత్తుచున్న బాలికలు వాని సహోదరులు.

गाता हुआ आदमी होशियार है । = పాడుచున్న మనుష్యుడు తెలివిగలవాడు.

गाते हुए आदमियाँ बड़े होशियार हैं । = పాడుచున్న మనుష్యులు చాల తెలివిగలవారు.

गाती हुई ललिता अच्छी लड़की है । = పాడుచున్న లలిత మంచి బాలిక.

गाती हुई औरतें बड़ी सुन्दरी हैं । = పాడుచున్న స్త్రీలు చాల అందమైనవారు.

काटता हुआ कुत्ता भाग गया। = కరచుచున్న కుక్క పరుగెత్తి పోయినది

बरसते हुए पानी में न खेलो। కురియుచున్న వానలో ఆటలాడవద్దు.

पद्मिनी जलती हुई आग में कूद पड़ी। = పద్మిని మండుచున్న అగ్నిలో దుమికినది

ఈ వర్తమాన కాలిక కృదంతము " చునే " అను అర్థములోకూడ వచ్చును. వీటికి ఉదాహరణములు క్రింద ఇవ్వబడి యుండుటను గమనింపుము.

वह खाता हुआ बोला। =అతడు భోజనముచేయుచునే మాటలాడెను

वे खाते हुए बोले। = వారు భోజనముచేయుచునే మాటలాడిరి.

यह खाती हुई बोली। =ఈమె భోజనముచేయుచునే మాటలాడినది.

ये खाती हुई बोलीं।। =వీరు భోజనముచేయుచునే మాటలాడిరి.

मैं हँसता हुआ दौड़ा। = నేను నవ్వుచునే పరుగెత్తితిని

तुम रोते हुए गये। = నీవు ఏడ్చుచునే పోతివి.

वह खेलता हुआ आया। = అతడు ఆటలాడుచునే వచ్చెను.

हम देखते हुए चले। = మేము చూచుచునే పోతిమి.

आप बोलते हुए गये। = తమరు మాటలాడుచునే పోతిరి.

सरोजा मुसकुराती हुई बैठी। = సరోజ చిరునవ్వు నవ్వుచునే కూర్చుండెను.

कमला और कांता घूरती हुई बैठीं। = కమలయు కాంతయు ఉరిమి చూచుచునే కూర్చుండిరి.

పై చెప్పిన వర్తమానకాలిక కృదంత ఉదాహరణముల యందు కృదంతమైన हुआ, हुए, हुई మొదలైన వాటిని

విడిచికూడ ఉపయోగించవచ్చును గాని అర్థములో ఎటువంటి భేదము నుండదు. వీటికి ఉదాహరణములు క్రింద ఇవ్వబడి యున్నవి.

दौड़ता लड़का मेरा भाई है। = పరుగెత్తుచున్న బాలుడు నా సహోదరుడు.

दौड़ते लड़के उसके भाई हैं। = పరుగెత్తుచున్న బాలురు వాని సహోదరులు.

दौड़ती लड़की मेरी बहन है। = పరుగెత్తుచున్న బాలిక నా సహోదరి

दौड़ती लड़कियाँ उसकी बहनें हैं। = పరుగెత్తుచున్న బాలికలు వాని సహోదరులు

मै हँसता दौड़ा। = నేను నవ్వుచునే పరుగెత్తితిని
तुम रोते गये। = నీవు ఏడ్చుచునే పోతివి
वह खेलता आया। = అతడు ఆటలాడుచునే వచ్చెను

---

## भूतकालिक कृदंत

భూతకాలిక క్రియతో **हुआ, हुए, हुई** చేర్చిన భూతకాలిక కృదంతము ఏర్పడును. వీటని విడిచి ఉపయోగించినను కూడ భూతకాలిక కృదంత అర్థములో ఎటువంటి భేదమును ఉండదు.

खिला फूल
खिला हुआ फूल } వికసించిన పుష్పము.

पढ़ा लिखा आदमी
पढ़ा लिखा हुआ आदमी } చదివిన మనుష్యుడు.

आये लोग
आये हुए लोग } వచ్చిన జనులు.

सूखी लकडी
सूखी हुई लकडी } ఎండిన కట్టె

आयी औरतें
आयी हुई औरतें } వచ్చిన స్త్రీలు

खिला फूल अब फुलवारी में नही है।
खिला हुआ फूल अब फुलवारी में नही है। } వికసించిన పుష్పము ఇప్పుడు తోటలో లేదు

पढ़ा लिखा आदमी इस गाँव में कोई भी नही है।
पढ़ा लिखा हुआ आदमी इस गाँव में कोई भी नही है।
చదివిన మనుష్యుడు ఈ గ్రామమున ఎవ్వడును లేడు.

आये लोग अपने अपने आसन पर बैठे।
आये हुए लोग अपने अपने आसन पर बैठे। } వచ్చిన జనులు తమ తమ ఆసనములో కూర్చొనిరి.

आयी औरतें यह देख कर कोसने लगीं।
आयी हुई औरतें यह देख कर कोसने लगीं। } వచ్చిన స్త్రీలు దీనిని చూచి దూషించిరి.

सूखी लकडी के बिना चूल्हे का काम नही चलता।
सूखी हुई लकडी के बिना चूल्हे का काम नहीं चलता।
ఎండినకట్టె లేక వంటపని జరుగదు.

मैं हमेशा गरम किया पानी पीता हूँ।
मै हमेशा गरम किया हुआ पानी पीता हूँ। } నేను ఎల్లప్పుడు కాచిన నీటిని త్రాగుచున్నాను.

मेरी स्त्री हर रोज़ लेटी चारपाई को नहीं उठाती।
मेरी स्त्री हर रोज लेटी हुई चारपाई को नहीं उठाती।
నా భార్య ప్రతిరోజు పండుకొనిన చాపను ఎత్తుటలేదు.

वह मरी औरत को याद याद कर रोता है।
वह मरी हुई औरत को याद याद कर रोता है।
అతడు చనిపోయిన స్త్రీని తలంచి తలంచి ఏడ్చుచున్నాడు.

हम बार बार स्वर्ग सिधारे गान्धीजी को याद करते हैं।
हम बार बार स्वर्ग सिधारे हुए गान्धीजी को याद करते हैं।
మేము అప్పుడప్పుడు స్వర్గస్థులైన గాంధీజీని తలంచుచున్నాము.

## अपूर्ण भूतकाल

వర్తమానకాలిక క్రియతో **था, थे, थी, थीं** చేర్చిన అపూర్ణ భూతకాలమగును పని పూర్తికాలేదని నిరూపించు దానిని అపూర్ణ భూతకాలమందురు ఉదా — "అతడు పాఠశాలకు పోవుచుండెను" అను వాక్యమునందు పని పూర్తి కాలేదనియు ఆ పని ఇంకను జరుగుచున్నదనుటను మనము గుర్తించవచ్చును. ఇట్టి కాలమును అపూర్ణ భూతకాలమందురు ఈ అపూర్ణ భూతకాలమునందు క్రియ సకర్మకముగనుండినను కర్తతో "ने" చేర్చకూడదు.

తాత్కాలిక వర్తమానకాలిక క్రియతో **था, थे, थी, थीं** చేర్చిన తాత్కాలిక అపూర్ణ భూతకాలమగును. ఈ కాలమునను కూడ క్రియ సకర్మకముగ నుండినను కర్తతో "ने" చేర్చ

కూడదు. ఈ కాలము భూతకాలమునందు అప్పుడే జరుగు పనిని గుర్తించును.

चक्की चलाने में उसे एक पवित्र आनंद आता था। =గానుగను త్రిప్పుట యందుఅతనికి ఒక పవిత్రమగు ఆనందము కలుగుచుండెను.

मित्रों के वैमनस्य से उन्हें दुःख होता था। = మిత్రుల అసూయ వలన వారికి దుఃఖము కలుగుచుండెను

आज यह भेंट लेकर जाने में उसे सकोच होता था। = నేడు ఈ కానుకను తీసికొని పోవుటకు అతనికి సిగ్గుగనుండెను

दूर होने के कारण शहर के लोग वहाँ कम जाते थे। = దూరముగ నుండుటవలన నగర ప్రజలు అచ్చటికి తక్కువగా పోవుచుండిరి

उस समय आप विजया का स्वप्न देखते थे। = ఆసమయమున తమరు విజయను స్వప్నమునందు చూచుచుంటిరి

वह उसको किसी न किसी तरह अपने पक्ष में लाना चाहते थे। =వారు అతనిని ఎట్టులైనను తన వశమునచేసికొనుటకు కోరుచుండెను.

इन गुणों के कारण जनता उनपर जान देती थी। = ఈ గుణముల వలన ప్రజలు అతనిని చాల ప్రేమించుచుండిరి

उसके पीछे एक सुन्दरी चली आती थी। = అతనికి వెనుక ఒక అందమైన స్త్రీ వచ్చుచుండెను.

वह बूढी घर का सारा काम काज करती थी। = ఆ ముదసలియామె ఇంటి పనులన్నిటిని చేయుచుండెను.

उनको कोई उत्तर न सूझता था। = అతనికి ఏ బదులును తోచకుండెను.

वह बीती हुई बातों पर पछताना नहीं जानते थे। = వారికి గడచిన విషయములను గురించి పశ్చాత్తాపడుటకు తెలియకుండెను.

इन रुपयों को देख देख कर सुभद्रा फूली न समाती थी। = ఈ రూపాయలను చూచిచూచి సుభద్ర చాల సంతోషించుచుండెను.

---

## तात्कालिक अपूर्ण भूतकाल

उसके मन में यही भाव काम कर रहा था। = అతని మనస్సునందు ఈ భావమే పనిచేయుచుండెను.

सरोवर में कमल खिल रहा था। = సరోవరమునందు తామర పుష్పము వికసించుచుండెను.

अब उसका चित्त भी यहाँ से उचाट हो रहा था। = ఇప్పుడు వాని మనస్సు కూడ విరక్తి చెందుచున్నది.

वे अपनी कुटीर में बैठे हुए लिख रहे थे। = వారు తమ గుడిసెయందు కూర్చొని వ్రాయుచుండిరి.

वह वर के आने की राह देख रहे थे। = వారు వరుని రాకను ఎదురుచూచుచుండిరి.

कुछ लोग फर्श बिछा रहे थे = కొందరు కంబళిని పరచుచుండిరి

शांता सजल नेत्रों से देख रही थी। = శాంత కన్నీరుతో నిండిన కండ్లతో చూచుచుండెను.

वह पति की बातें सुनकर दुखित हो रही थी। = ఆమె భర్తమాటలను విని దుఃఖించుచుండెను

यह वेश्यायें वहाँ से वापस आ रही थी। = ఈ వేశ్యలు అచ్చటనుండి తిరిగి వచ్చుచుండిరి

అపూర్ణభూతకాలమైన **था, थे, थी, थीं** లకు బదులుగా **रहा, रहे, रही, रहीं** లు కూడ ఉపయోగించవచ్చును.

वह रास्ता फिर खुला ही था।<br>
वह रास्ता फिर खुला ही रहा। } ఆత్రోవ పిమ్మట తెరిచియేఉండెను.

वर्धमान 30 वर्ष तक घर में ही थे।<br>
वर्धमान 30 वर्ष तक घर में ही रहे।

వర్ధమానుడు ముప్పై సంవత్సరములవరకు ఇంటియందేవుండెను.

कपड़े पहनने की भी सुध न थी।<br>
कपड़े पहनने की भी सुध न रही। } బట్ట ధరించుటకు కూడ జ్ఞాపకము లేదు

गजाधर एक मिनट कुछ सोचता रहा। = గజాధరుడు ఒక నిమిషము ఏదో యోచించుచుండెను.

मुँह से लात घूँसों का जवाब देता रहा। = దెబ్బలకు జవాబు తన నోటిలో ఇచ్చుచుండెను

दोनों मुकद्दमे महीने भर तक चलते रहे। = రెండు కేసులును మాసమంతయు జరుగుచునే ఉండెను.

लेकिन उमानाथ सुयोग्य वर ढूँढते रहे। = కాని, ఉమానాథుడు మంచి వరుని వెదకుచునే ఉండెను.

पर सुभद्रा अपनी ससुराल की ही बातें करती रही। = కాని, సుభద్ర తన అత్తగారింటి మాటలను మాటలాడుచు ఉండెను

आठ बजे तक वह उसकी राह देखती रही। = ఎనిమిది గంటలవరకు అతని రాకకు ఎదురు చూచుచు ఉండెను.

## हेतुहेतुमद् भूतकाल

రెండు పనులు పూర్తి కాలేదని తెలుపు కాలమునకు హేతుహేతుమద్భూత కాలము నెదరు, ఉదా .— वह यह काम करता तो मैं उसको इनाम देता। = అతడు ఈ పనిని చేసి యుండి

నచో నేను అతనికి బహుమానము ఇచ్చియుండెడివాడను ఈ వాక్యము అతడు ఈ పనిని చేయనందుచే నేను అతనికి బహుమానము ఇవ్వలేదను అర్థము నిచ్చును. కాన ఇచ్చట రెండు పనులును పూర్తి కాలేదని మనము గుర్తించగలము ఇట్టి కాలమునకే హేతుహేతుమద్భూతకాలమందురు. ఇట్టి కాలమునందు రెండు వాక్యములు జంటగా వచ్చును. ఈ రెండు వాక్యములలోని క్రియలు వర్తమానకాల రూపమునసుండును. ఇట్టి వాక్యములలో సహాయక క్రియలు రావు మరియు ' **ने** ' ప్రత్యయముకూడరాదు. ఐతే భూతకాలిక క్రియతో **होता, होते, होती** చేర్చినకర్తతో **ने** ప్రత్యయము వచ్చును ఉదా — **उसने यह काम किया होता तो मैं ने उस को इनाम दिया होता ।** = అతడు ఈ పనిని చేసియుండినచో నేను అతనికి బహుమానము ఇచ్చియుందును. ఈ వాక్యమునందు **किया, दिया** అను భూతకాలిక క్రియతో **होता** అను వర్తమానకాలము వచ్చియుండుట వలన కర్తతో **ने** ప్రత్యయమును వచ్చుటను గమనింపుడు

**कोई दूसरा लड़का होता तो पहले दिन ही फटकार देता ।** = వేరొక బాలుడుగనుండిన మొదటి దినమే తిట్టియుండును.

**तुमने चतुराई से काम लिया होता तो यह नौबत न आती ।** = నీవు సామర్థ్యముతో పనిచేసియుండినచో ఈ కష్టము వచ్చియుండదు.

**तुम मेरी जगह होते तो तुम इस समय क्या जवाब देते ।** = నీవు నా చోటయుండినచో నీ పిసమయమున ఏమి బదులు యిచ్చిఉందువు?

**दीवार से टिक कर बैठते तो कभी न गिरते ।** = గోడకు ఆనుకొని కూర్చొనియుండినచో నీ వెప్పుడును పడియుండవు.

दूसरी होती तो ऐसे मियाँ पर लात मार कर कभी की चली गई होती।
వేరొక స్త్రీగానుండిన ఇటువంటి భర్తను వదలి ఎప్పుడో వెళ్ళి పోయియుండును.

तुम्हारी सूरत मुझे दी होती तो मैने सोने की दीवार खडी कर ली होती।
నీ అందమును నా కిచ్చియుండినచో నేను బంగారుగోడ కట్టిఉందును

## वे, ये, के बदले, वह, यह का प्रयोग

.. वे, ये కు బదులుగ वह, यह కూడ ఉపయోగించ వచ్చును. वह, यह ఉపయోగించునపుడు క్రియలు బహువచనముగానేనుండును. ఇట్లు కర్త ఏకవచనముగాను, క్రియ బహువచనముగాను ఉపయోగించుట ఒక మంచి ప్రయోగము. ఇటువంటి ఉదాహరణములు పై వాక్యములందు గమనింపుము క్రిందకూడ ఇటువంటివి కొన్ని ఉదాహరణములు గమనింపుము

| | |
|---|---|
| वह गरीबों की मदद करते थे।<br>वे गरीबों की मदद करते थे। | వారు బీదలకు సహాయము చేయుచుండిరి |
| वह एक अच्छे आदमी हैं।<br>वे एक अच्छे आदमी हैं। | వారొక మంచి మనుష్యులు |
| यह दान पुण्य करते थे।<br>ये दान पुण्य करते थे। | వీరు దాన ధర్మములు చేయుచుండిరి. |
| यह अमीर आदमी हैं।<br>ये अमीर आदमी हैं। | వీరు ధనవంతులు. |

## अपना का प्रयोग

తన సొంత వస్తువులను, మనుష్యులను గుర్తించుటకు హిందీయందు अपना అను పదమును ఉపయోగించవలయును. अपना అను పదమునకు అర్థము "తన". తెలుగు నందు ఈ "తన" అను పదము అరుదుగ ఉపయోగించెదరు. ఇట్లు అరుదుగ ఉపయోగించుటవలన కొన్ని వాక్యములు స్పష్టమైన అర్థమును నిచ్చుటలేదు ఉదాహరణమునకు వాడు వాని భార్యను ప్రేమించుచున్నాడు అను వాక్యమునందు వాడు తన భార్యను ప్రేమించుచున్నాడా ? లేక ఇతరుని భార్యను ప్రేమించుచున్నాడా ? అను సందేహము కలుగుచున్నది అట్టి సమయములందు వాడు తన భార్యను ప్రేమించుచున్నాడు. అను వాక్యమునందు అర్థము స్పష్టముగనున్నది. కావనే హిందీయందు ఇట్టి సమయములందు अपना అను పదమును ఉపయోగించవలయును.

अपना అను పదము కర్తననుసరించి మారుటలేదు. ఇది దానికి మునుపువచ్చునటువంటి నామవాచకము ననుసరించి మారుచుండును. పుంలింగ నామవాచకము ఏకవచనముగ నుండిన अपना వచ్చును బహువచనముగానుండిన अपने వచ్చును. ఆ పుంలింగ నామవాచకమునకు ప్రక్కన ఏదైన విభక్తి ప్రత్యయము వచ్చినను లేక మరిగియుండినను अपने వచ్చును. నామవాచకము స్త్రీలింగ ఏకవచనము బహువచనముగ నుండిన अपनी వచ్చును. ఆ స్త్రీలింగ నామవాచకమునకు ప్రక్కను విభక్తి ప్రత్యయము వచ్చినను अपनी అను పదము अपने అని మారుటలేదు.

### उदाहरण

मैं अपना पाठ लिखता हूँ = నేను నా పాఠమును వ్రాయుచున్నాను.
तुम अपना पाठ लिखो। = నీవు నీ పాఠమును వ్రాయుము.
वह अपना पाठ लिखता है। = అతడు తన పాఠమును వ్రాయుచున్నాడు
वे अपना पाठ लिखते हैं। = వారు తమపాఠమును వ్రాయుచున్నారు.

रामदास अपना कपड़ा धोता है। = రామదాసు తన బట్టను ఉతుకుచున్నాడు.
रामदास अपने कपड़ों को धोता । = రామదాసు తన బట్టలను ఉతుకుచున్నాడు.
रामदास अपने घर में बैठा है। = రామదాసు తన ఇంటిలో కూర్చొనియున్నాడు.
रामदास अपने घर चला गया। = రామదాసు తన ఇంటికి వెళ్ళిపోయెను.

माधव अपनी किताब देखता है। = మాధవుడు తన పుస్తకమును చూచుచున్నాడు.
माधव अपनी किताबें देखता है। = మాధవుడు తన పుస్తకములను చూచుచున్నాడు.
माधव ने अपनी तसवीर को देखा। = మాధవుడు తన పటమును చూచెను.
माधव ने अपनी तसवीरों को देखा। = మాధవుడు తన పటములను చూచెను.

पन्ना के एक अपना लड़का था। = పన్నాకు ఒక సొంతకొడుకు ఉండెను.
यह उसकी ही अपनी धरती है। = ఇది అతని సొంతభూమియే.

यह उनकी अपनी ही बेटी थी। =ఆమె వారి సొంతకూతురుగా నుండెను

हमारा अपना भी कुछ अनुभव है। = మాకు కొంత సొంత అనుభవ మున్నది.

हर एक देश का अपना कोई एक नाम होता है। = ఒక్కొక్క దేశమునకును ఏదైన ఒక సొంత పేరుండును

अपनी माता को देख कर वह छिप गया। = అతడు తన తల్లినిచూచి దాగుకొనెను

अपनी स्त्री को लख कर वह भाग गया। = తన భార్యను చూచి అతడు పారిపోయెను.

अपनी अपनी किताबें लेकर खूब पढो। = మీరు మీమీ పుస్తకములను తీసికొని బాగుగా చదువుడు

अपनी अपनी बहनों को प्यार करना सीखो। = మీ మీ సహోదరులను ప్రేమించుటను నేర్చుకొనుడు

क्या अभी तक अपना सबक नहीं लिखा ? = ఇంత వరకును నీ పాఠమును వ్రాయలేదా?

यह सब अपना अपना भाग्य है। = ఇది అంతయు తమ తమ భాగ్యము

क्यों अपने सरदार की बात सुन कर डर गये ? = మీ యజమానుని యొక్క మాటవిని ఎందుకు భయపడిపోతివి?

अपने अपने मकान जाकर आराम करो। = మీ మీ యిండ్లకుపోయి విశ్రాంతి తీసికొనుడు.

పై ఉదాహరణములయందు ఐదవ వాక్యమునందు బట్టను అను నామవాచకము ఏకవచనముగా నుండుటవలన अपना వచ్చుటను గమనింపుము. ఆరవ వాక్యమునందు బట్టలను

అను నామవాచకము బహువచనముగ నుండుటవలన **अपने** వచ్చుటను గమనింపుము. ఏడవ వాక్యమునందు ఇల్లు అను నామవాచకమునకు ప్రక్కను సప్తమి విభక్తి **में** వచ్చుటవలన **अपने** వచ్చుటను గమనింపుము. ఎనిమిదవ వాక్యమునందు ఇల్లు అను నామవాచకమునకు ప్రక్కను చతుర్థివిభక్తి **को** మరిగి యుండుటవలన **अपने** వచ్చుటను గమనింపుము. తొమ్మిదవ, పదవ వాక్యములందు పుస్తకమును అను స్త్రీలింగ నామ వాచక ముండుటవలన **अपनी** వచ్చుటను గమనింపుము. పదు నొకండవ, పన్నెండవ వాక్యములందు పటమును అను స్త్రీలింగ నామవాచకమునకు ప్రక్కను ద్వితీయావిభక్తి **को** వచ్చుట వలన **अपनी** అను పదమునందు ఏ మార్పు లేకుండుటను గమ నింపుము.

విభక్తి ప్రత్యయములను గురించి మరొక పాఠమునందు గమనింపుము.

## गुण और सम्बन्ध सूचक क्रिया

### गुण सूचक उदाहरण

హిందీయందు **होता, होते, होती** అనునవి ఒక విశేష ప్రయోగము. వీనిని నిజమును నిరూపించుటకు ఉపయోగించ వలయును. పుంలింగ ఏకవచనముగనుండిన **होता**, పుంలింగ బహువచనముగనుండిన **होते**, స్త్రీలింగ ఏకవచన, బహువచన ములకు **होती** ఉపయోగించవలయును.

సంబంధమును గుర్తించుటకు కూడ వీనిని ఉపయోగించవలయును.

हाथी का सिर बड़ा होता है। = ఏనుగుతల పెద్దదిగానున్నది ఈ వాక్యము ఏనుగుతల పెద్దదిగానున్నదను నిజమును నిరూపించుచున్నది. కాన ఇట్టి సమయములందు होता ఉపయోగించవలయును

आदमी के दो पैर होते हैं। =మనుష్యునికి రెండు కాళ్లున్నవి. ఈ వాక్యము మనుష్యునికి రెండు కాళ్ళున్నదను నిజమును నిరూపించుచున్నది కాన ఇట్టి సమయములందు होते ఉపయోగించవలయును

बंदर की पूँछ लंबी होती है। = కోతితోక నిడుపుగానున్నది. ఈ వాక్యము కోతి తోక నిడుపుగానున్నదను నిజమును నిరూపించుచున్నది पूँछ అను పదము స్త్రీలింగముగనుండుటచే होती అను పదమును వాడి యుండుటను గమనింపుము.

हाथी की आँखें छोटी होती हैं। = ఏనుగుకండ్లు చిన్నవిగా నున్నవి ఈ వాక్యము ఏనుగుకండ్లు చిన్నవిగానున్నవను నిజమును నిరూపించుచున్నది आँखें అను పదము స్త్రీలింగ బహువచనముగా నుండుటచే దీనికికూడ होती అను పదము వాడియుండుటను గమనింపుము

सोना अत्यन्त घन होता है। = బంగారము చాల బరువుగనుండును
लोहा बड़ा कठोर होता है। = ఇనుము చాల కఠినముగ నుండును

प्रत्येक भित्ति के किवाडों के कान होते हैं। = ఒక్కొక్క గోడ తలుపునకును చెవులున్నవి.

गधे के कान लंबे होते हैं। = గాడిదచెవులు నిడుపుగా నున్నవి.

कुत्ते की पूँछ टेढी होती है। = కుక్కతోక వంకరగానున్నది

इन पहाडियों की गायें छोटी होती हैं। = ఈ పర్వతపు ఆవులు చిన్నవిగ నున్నవి.

---

सम्बन्ध सूचक उदाहरण

शहर में किसके घर होता है? = పట్టణములో ఎవరికి ఇల్లున్నది

विपत्ति में कौन साथी होता है? ఆపదసమయములందు మిత్రుడెవరు?

ये लोग किसके मित्र होते हैं? = వీరు ఎవరికి మిత్రులు.

शत्रु-मित्र सब किसी के होते हैं। = శత్రువులును మిత్రులును అందరికి ఉండెదరు.

वह तो उनकी भी बेटी ही होती है। =ఆమె వారికికూడ పుత్రికయే

तुम मेरे कौन होते हो? = నీవు నాకేమి కావలయును?

वह उसकी कौन होती है? = ఆమె వానికేమి కావలయును?

वह उसकी बहन होती है? = ఆమె వాని సహోదరి.

होना అను క్రియ క్రింది అర్థములలో కూడ వచ్చును.

परमात्मा के दरबार में यह न्याय होता है। = భగవంతుని సభలో ఈ న్యాయము జరుగుచున్నది

इधर हर साल बडा मेला होता है। = ఇచ్చట ప్రతి సంవత్సరము పెద్ద ఉత్సవము జరుగుచున్నది.

उधर अच्छे अच्छे खेल होते हैं। = అప్పుట మంచి మంచి ఆటలు జరుగుచున్నవి

तेरे स्कूल में कौन कौन खेल होते हैं? నీ పాఠశాలయందు ఏ యేమి ఆటలు జరుగుచున్నవి?

गालियों की लड़ाई स्त्रियों में ही होती है। = తిట్ల జగడము స్త్రీలలోనే జరుగుచున్నది

पर गालियों की लडाई पुरुषों में भी होती है। = కాని పురుషులలో కూడ తిట్ల జగడము జరుగుచున్నది.

संसार में सन्मार्ग पर चलने का यह फल होता है। = ప్రపంచము నందు మంచిత్రోవను పోవువారికి ఈ ఫలితము కలుగుచున్నది

प्रेम से मनुष्य को अनंत लाभ होते हैं। = ప్రేమచే మనుష్యునకు అనేక లాభములు లభించుచున్నవి

मान मर्यादा धन से नहीं होती। = మాన మర్యాద ధనముచే కలుగదు.

मान मर्यादा धर्म से तो होती है। = మాన మర్యాద న్యాయముచే లభించుచున్నది

कष्टों से शरीर को दुख होता है। = కష్టపడుటచే శరీరమునకు దుఃఖము కలుగుచున్నది.

देखें, यह माल कैसे हजम होता है? = ఈ ధనము ఎట్లు నాశనమగునో, చూతము.

बाकी धन अन्य काम में खर्च होता है। = మిగిలిన ధనము ఇతర కార్యములకు ఖర్చగుచున్నది.

कल से काम प्रारंभ होते हैं। = రేపటినుండి పనులు ప్రారంభమగుచున్నవి.

नशे से मनुष्य के शरीर में अनेक रोग उत्पन्न होते हैं। = మత్తువలన, మనుష్యుని శరీరమున అనేక రోగములు పుట్టుచున్నవి.

मन को निर्मल बनाने के लिये प्रेम की आवश्यकता होती है। = మనస్సును పరిశుభ్రముగ నుంచుటకు ప్రేమ అత్యవసరముగా కావలెను

भोजन अभी तैयार होता है। = భోజనము ఇప్పుడే తయారగుచున్నది

भोजन अभी तैयार होगा। = భోజనము ఇప్పుడే తయారగును

भोजन अभी तैयार हुआ। = భోజనము ఇప్పుడే తయారయ్యెను.

गंगा के किनारे गेहूँ अधिक पैदा होता है। = గంగానది యొడ్డున గోధుమ అధికముగ పైరగుచున్నది

उसमें हर तरह के अनाज पैदा होते हैं। = అందు అన్నివిధములైన ధాన్యములు పైరగుచున్నవి.

हमारे देश में रूई कम पैदा होती है। = మన దేశమునందు ప్రత్తి చాల తక్కువగా పైరగుచున్నది

# विधि

तुम కర్తగా వచ్చిన ధాతువులో ओ చేర్చవలయును.
आप కర్తగా వచ్చిన ధాతువుతో इये చేర్చవలయును.

बैठ + ओ = बैठो। तुम बैठो। = నీవు కూర్చొనుము.

लिख + ओ = लिखो। तुम लिखो। = నీవు వ్రాయుము.

पढ़ + ओ = पढ़ो। तुम पढ़ो। = నీవు చదువుము.

दौड़ + ओ = दौड़ो। तुम दौड़ो। = నీవు పరుగెత్తుము

बैठ + इये = बैठिये। आप बैठिये। = తమరు కూర్చొనుడు

लिख + इये = लिखिये। आप लिखिये। = తమరు వ్రాయుడు

पढ़ + इये = पढ़िये। आप पढ़िये। = తమరు చదువుడు
दौड़ + इये = दौड़िये। आप दौड़िये। = తమరు పరుగెత్తుడు

**कर, पी, ले, दे** ఈ ధాతువులు క్రింది విధముగ మారును. దీనిని బాగుగ జ్ఞప్తియందుంచుకొనవలయును.

कर + ओ = करो। तुम करो। = నీవు చేయుము (ఇందు మార్పు లేదు)
पी + ओ = पिओ। तुम पिओ। = నీవు త్రాగుము.
दे + ओ = दो। तुम दो। = నీవు ఇమ్ము
ले + ओ = लो। तुम लो। = నీవు తీసికొనుము

कर + जिये = कीजिये। आप कीजिये। = తమరు చేయుడు.
पी + जिये = पीजिये। आप पीजिये। = తమరు త్రాగుడు.
दे + जिये = दीजिये। आप दीजिये। = తమరు ఇవ్వండి
ले + जिये = लीजिये। आप लीजिये। = తమరు తీసికొనుడు.

**तुम** కు బదులుగ **तू** కర్తగా ఉపయోగించిన ధాతువు ఏ మార్పు లేకుండ వచ్చును

तू बैठ। = నీవు కూర్చొనుము
तू लिख। = నీవు వ్రాయుము
तू पढ़। = నీవు చదువుము.
तू दौड़। = నీవు పరుగెత్తుము.

# जाति अक्षर का प्रयोग

ఒక శబ్దములో ఒక అక్షరమునకు పైచుక్క యుండిన ఆ చుక్క ఏ అక్షరమును గుర్తించును? అది ఎట్లు ఉచ్చరించవలయును? వీటిని బాగుగ తెలిసికొనవలయును. అక్షరమునకు పై చుక్క యుండిన ఆ చుక్కకు ప్రక్కను ఏ అక్షరము వచ్చునో ఆ అక్షరముయొక్క జాతి అక్షరము ఆ చుక్క గుర్తించును.

జాతి అక్షరములు ఏవి? వాటిని తెలిసికొనవలయును హిందీ భాషయందు క వర్గము, చ వర్గము, ట వర్గము, త వర్గము, ప వర్గము అని ఐదు వర్గములున్నవి. ఒక్కొక్క వర్గమునకు ఒక జాతి అక్షరమున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| క వర్గము | क ख ग घ ङ | ఈ వర్గమునకు | ङ | జాతి అక్షరము |
| చ వర్గము | च छ ज झ ञ | ,, | ञ | ,, |
| ట వర్గము | ट ठ ड ढ ण | ,, | ण | ,, |
| త వర్గము | त थ द ध न | ,, | न | ,, |
| ప వర్గము | प फ ब भ म | , | म | ,, |

ఈ జాతి అక్షరములు ఎప్పుడును తమ తమ వర్గ అక్షరములలోనే వచ్చును.

अक, पाच, अडा, अत, साप వీటిలో మొదటి శబ్దమైన अक (అక్) తీసికొందము. ఈ अक అను శబ్దములోనుండు अ అక్షరముపై చుక్క పెట్టినచో अंक (అఙ్క్) అగును. చుక్కకు ప్రక్కన क అక్షరము ఉన్నది. ఈ क అక్షరమునకు జాతి అక్షరము ङ అగును. దానివలన ఈ శబ్దమును 'అఙ్క్' అని ఉచ్చరింపవలయును.

ఇప్పుడు రెండవ శబ్దమైన पाच (పాచ్) తీసికొందము ఈ पाच అను శబ్దములోనుండు पा అక్షరముపై చుక్క పెట్టినచో पांच (పాఞ్ చ్) అగును చుక్కకు ప్రక్కన च అక్షరము ఉన్నది ఈ च అక్షరమునకు జాతి అక్షరము ञ అగును. దాని వలన ఈ శబ్దమును 'పాఞ్ చ్' అని ఉచ్ఛరింపవలయును

మూడవ శబ్దమైన अडा (అడా) తీసికొందము ఈ अडा అను శబ్దములోనుండు अ అక్షరముపై చుక్క పెట్టినచో अंडा (అణ్ డా) అగును చుక్కకు ప్రక్కను डा అక్షరము ఉన్నది ఈ डा అక్షరమునకు జాతి అక్షరము ण అగును. దాని వలన ఈ శబ్దమును ' అణ్ డా ' అని ఉచ్ఛరింపవలయును

నాలుగవ శబ్దమైన अत (అత్) తీసికొందము. ఈ अत అను శబ్దములోనుండు अ అక్షరముపై చుక్క పెట్టినచో अंत (అన్ త్) అగును చుక్క ప్రక్కను त అక్షరమున్నది. ఈ त అక్షరమునకు జాతి అక్షరము न అగును. దాని వలన ఈ శబ్దమును ' అన్ త్ ' అని ఉచ్ఛరింపవలయును.

ఐదవ శబ్దమైన साप (సాప్) తీసికొందము. ఈ साप అను శబ్దములోనుండు सा అక్షరముపై చుక్క పెట్టినచో सांप (సామ్ప్) అగును. చుక్క ప్రక్కను प అక్షరమున్నది. ఈ प అక్షరమునకు జాతి అక్షరము म అగును దాని వలన ఈ శబ్దమును 'సామ్ప్' అని ఉచ్ఛరింపవలయును.

చుక్కకు బదులుగ జాతి అక్షరమునుగూడ ఉపయోగించవచ్చును. అయితే ఆ జాతి అక్షరము పూర్ణ అక్షరముగా ఉపయోగించరాదు. అర్ధ అక్షరమే ఉపయోగించవలయును.

## अङ्क, पाञ्च, अण्डा, अन्त, साम्प

पंक, आंख, अंग, जांघ ఈ శబ్దములలోనుండు చుక్క క వరమునకు జాతి అక్షరమైన ङ ధ్వనిని ఇచ్చుటను గమనింపుము

आंच, पूंछ, पंजा, सांझ ఈ శబ్దములలోనుండు చుక్క చ వర్గమునకు జాతి అక్షరమైన ञ ధ్వనిని ఇచ్చుటను గమనింపుము.

ऊंट, ठूंठ, ढंढ, ठण्डक ఈ శబ్దములలోనుండు చుక్క ట వర్గమునకు జాతి అక్షరమైన ण ధ్వనిని ఇచ్చుటను గమనింపుము

दांत, पंथ, फंदा, धंधा ఈ శబ్దములలోనుండు చుక్క త వర్గమునకు జాతి అక్షరమైన न ధ్వనిని ఇచ్చుటను గమనింపుము

सांप, हांफ, अंबर, दंभ ఈ శబ్దములలోనుండు చుక్క ప వర్గమునకు జాతి అక్షరమైన म ధ్వనిని ఇచ్చుటను గమనింపుము.

म అక్షరమునకు పిదప వచ్చుచున్న य र ल व श ष स ह क्ष మొదలైన ఈ అక్షరములకు జాతి అక్షరములేదు అయితే ఒక శబ్దములో చుక్కయుండి ఆ చుక్కకు ప్రక్కను ఈ అక్షరములు వచ్చిన ఆ చుక్కను బహుశా 'న్' ధ్వనిగా ఉచ్చరింపవలయును. కొన్ని శబ్దములలో 'మ్' ధ్వనిగాకూడ ఉచ్చరింపవలయును.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| काँसा | झँसना | बंसी | పీటిలోనుండు చుక్క "న్" అగును. | संयम | हंस | | వీటిలోనుండు చుక్క "మ్" అగును. |
| खाँसी | धँसान | भंसा | | संरक्षक | कंस | | |
| गाँसी | पंसारी | संयासी | | संलाप | मांस | | |
| घूँसा | प्रशँसा | संसार | | संवाद | संक्षेप | | |
| चंसुर | फाँसी | हँस | | वंश | | | |

హిందీ భాషయందు ఇతర భాషలయొక్క శబ్దములు కలిసియున్నవి. ఆ విధముగ కలిసిన శబ్దములయొక్క అక్షరమునకు క్రింద చుక్కయుండును. ఎక్కడ చుక్కయుండిన ఆ శబ్దమును కడుపులోనుంచి ఉచ్చరింపవలయును

| | | | | |
|---|---|---|---|---|
| जमीन | क़लम | खानदान | फ़ील | ग़दर |
| ज़मानत | क़द्र | ख़सम | फ़रज़ंद | |

ड, ढ ఈ రెండు అక్షరములు శబ్దమునందు మొదటి అక్షరముగవచ్చిన ఈ అక్షరములకు క్రింద చుక్కయుండదు.

అయితే శబ్దమునందు మొదటి అక్షరమునకు పిదప ఈ అక్షరములు వచ్చిన క్రింద చుక్కయుండును

डर, डाली, डिबिया, डेग, ।
ढका, ढाना, ढीया, ढिबरी, ।
} ఈ శబ్దములందు ड, ढ మొదటి అక్షరములుగ నుండుటవలన క్రింద చుక్క లేకుండుటను గమనింపుము.

कड़ा, जाड़ा, बड़ा, पेड़ ।
काढ़ा, चढ़ाई, दाढ़, पढ़ ।
} ఈ శబ్దములయందు ड, ढ మొదటి అక్షరములకు పిదప వచ్చుటవలన క్రింద చుక్క యుండుటను గమనింపుము.

## कारक

హిందీలోకూడ ఎనిమిది విభక్తి ప్రత్యయములున్నవి వీనిని **कारक** అనిచెప్పుదురు అవి యేవనగా कर्ता, कर्म, करण, सम्प्रदान, अपादान, सम्बन्ध, अधिकरण, सम्बोधन, ప్రథమావిభక్తి

కర్తయగును. కర్తకు నే ప్రత్యయమున్నను, లేకున్నను అదియే ప్రధానమైన క్రియగును

(1) ने (कर्ता)
(2) को ని, ను (कर्म)
(3) से తో, కూడ, చేత (करण)
(4) के लिये, के वास्ते, को కొరకు, కై, కు, కి (सम्प्रदान)
(5) से నుండి, కంటె (अपादान)
(6) का, के, की యొక్క (संबंध)
(7) पर మీద; में లో, లోపల (अधिकरण)
(8) अरे, हे ఓరీ, ఓ (संबोधन)

### उदाहरण

प्रथम विभक्ति कर्ता —

1. मनोहर कल आगरा गया। = మనోహరుడు నిన్న ఆగ్రా వెళ్ళెను
मनोहर ने कल पेट भर खाया। = మనోహరుడు నిన్న కడుపు నిండ భోజనము చేసెను.

द्वितीय विभक्ति कर्म —

2. तुम राघव को अभी बुलाओ। = నీవు రాఘవుని ఇప్పుడే పిలువుము.
मै गौरी को अभी बुलाता हूँ। = నేను గౌరిని ఇప్పుడే పిలుచుచున్నాను.

तृतीय विभक्ति करण —

3. यह काम शेखर से हुआ। = ఈ పని శేఖరునిచేత అయ్యెను.

यह वस्तु खून मे मिल जाती है। =ఈ వస్తువు రక్తముతో కూడ కలిసిపోవుచున్నది

यह दीवार उस दीवार से मिली है। = ఈ గోడ ఆ గోడతో కలిసియున్నది

चौथी विभक्ति सम्प्रदान —

4. मै सरला केलिये यह फल लाया। = నేను సరళ కొరకు ఈ పండును తెచ్చితిని.

वह राम के वास्ते मिठाई लायी। = ఆమె రాముని కొరకు మిఠాయి తెచ్చెను

तुम जानकी को फूल देते हो। = నీవు జానకికి పుష్పము ఇచ్చు చున్నావు.

पचमी विभक्ति अपादान —

5. नारायण से राजू ने आम ले लिया। = నారాయణుని వద్దనుండి రాజు మామిడిపండును తీసికొనెను.

वह नारायण से बहुत छोटा है। = అతడు నారాయణుని కంటె చాల చిన్నవాడు

षष्ठी विभक्ति सबंध —

6 गोविन्द का घर दूर है। = గోవిందుని యొక్క ఇల్లుదూరము.

रहीम के घोडे तेज दौड़ते हैं। = రహీముని గుఱ్ఱములు వేగముగ పరుగెత్తుచున్నవి

विमला शंकर की बहन है। = విమల శంకరుని సహోదరి

सप्तमी विभक्ति अधिकरण —

7. मेज पर दवात है। = మేజా మీద సిరాబుడ్డియున్నది

घर में ताराबाई पढती है। = ఇంటిలో తారాబాయి చదువు చున్నది.

संबोधन —

8. अरे, जयराम जल्दी कर = అరే, జయరామ శీఘ్రముగ బయలుదేరరా.

हे, मल्लिका वहाँ क्या करती हो ? = ఓ మల్లిక, అచ్చట ఏమి చేయుచున్నావు ?

పైన చెప్పబడియుండు విభక్తి ప్రత్యయములు సర్వనామములతో చేర్చిన క్రింది విధముగ మారును

मैं + को = मुझको, मुझे
मैं + से = मुझ से
मैं + के लिये = मेरे लिये
मैं + के वास्ते = मेरे वास्ते

मैं + का = मेरा
मैं + के = मेरे
मैं + की = मेरी
मैं + पर = मुझ पर
मैं + में = मुझ में

वह + को = उसको, उसे
वह + से = उससे
वह + के लिये = उस केलिये
वह + के = उसके वास्ते
वह + का = उसका

तुम + को = तुझको, तुझे, तुमको, तुम्हें
तुम + से = तुमसे, तुझ से
तुम + के लिये = तुम्हारे लिये, तेरे लिये
तुम + के वास्ते = तुम्हारे वास्ते, तेरे वास्ते

तुम + का = तुम्हारा, तेरा
तुम + के = तुम्हारे, तेरे
तुम + की = तुम्हारी, तेरी
तुम + पर = तुम पर, तुझपर
तुम + में = तुममें, तुझ में

यह + को = इसको, इसे
यह + से = इससे
यह + के लिये = इसकेलिये
यह + के वास्ते = इसके वास्ते
यह + का = इसका

वह + के=उसके
वह + की=उसकी
वह + पर=उस पर
वह + में=उसमें

वे + को=उनको, उन्हे
वे + से=उनसे
वे + के लिये=उनके लिये
वे + के वास्ते=उनके वास्ते
वे + का=उनका
वे + के=उनके
वे + की=उनकी
वे + पर=उनपर
वे + में=उन में

कौन + को=किसको, किनको, किन्हे
कौन + से=किससे, किनसे
कौन + के लिये=किसके लिये,
किनके लिये
कौन + के वास्ते=किसके वास्ते,
किनके वास्ते
कौन + का=किसका, किनका
कौन + के=किसके, किनके
कौन + की=किसकी, किनकी
कौन + पर=किसपर, किनपर
कौन + में=किसमें, किन में

यह + के=इसके
यह + की=इसकी
यह + पर=इसपर
यह + में=इसमें

ये + को=इनको, इन्हें
ये + से=इनसे
ये + के लिये=इनके लिये
ये + के वास्ते=इनके वास्ते
ये + का=इनका
ये + के=इनके
ये + की=इनकी
ये + पर=इनपर
ये + में=इनमें

जो + को=जिसको, जिनको, जिन्हें
जो + से=जिससे, जिनसे
जो + के लिये=जिसके लिये,
जिनके लिये
जो + के वास्ते=जिसके वास्ते,
जिनके वास्ते
जो + का=जिसका, जिनका
जो + के=जिसके, जिनके
जो + की=जिसकी, जिनकी
जो + पर=जिसपर, जिनपर
जो + में=जिसमें, जिनमें

हम + को=हमें, हमको
हम + से=हमसे
हम + के लिये=हमारे लिये
हम + के वास्ते=हमारे वास्ते
हम + का=हमारा

हम + के=हमारे
हम + की=हमारी
हम + पर=हमपर
हम + में=हममें

ఒక్కొక్క విభక్తిప్రత్యయము తన సొంత అర్థము లను వదలి వేరొక విభక్తిప్రత్యయ అర్థములందు వచ్చుటకలదు ఇది హిందీలో ఒక ముఖ్యమైన విశేషము

**द्वितीय, चतुर्थि कारक चिन्ह "को" के स्थान पर षष्ठी कारक चिन्ह "का, के, की" का प्रयोग।**

రెండవ, నాలుగవ విభక్తి ప్రత్యయమునకు చెందిన **को** కు బదులుగా ఆరవ విభక్తి ప్రత్యయమైన **का, के, की** యొక్క ఉపయోగము కర్తలో రెండు నామవాచకములు వచ్చినను లేక రెండు సర్వనామములు వచ్చినను లేక ఒక నామవాచకము, వేరొక సర్వనామము వచ్చినను రెండవ దానిలో వచ్చు నామవాచకముతో లేక సర్వనామముతో ఈ రెండవ, నాలుగవ విభక్తి ప్రత్యయమైన **को** కు బదులుగా ఆరవ విభక్తి ప్రత్యయమైన **का, के, की** వచ్చును ఇట్లు వచ్చినను ఈ వాక్యము లందు ఆరవ విభక్తి ప్రత్యయ అర్థము (యొక్క) లోపించి రెండవ, నాలుగవ విభక్తి ప్రత్యయ అర్థము (ని, ను, కి, కు) ఇచ్చును.

ఈ నియమము అన్నిటికిరాదు. క్రియ "ముహావరా" గా నుండునపుడు ఈ నియమమువచ్చును ముహావరా 'ఏది' ?

అనునది గమనింపుము. సొంతమైన అర్థమును విడిచి వేరొక అర్థమును ఇచ్చునదియే ముహావరా అగును. ఉదా — नौ दो ग्यारह हुआ = దీనికి సొంత అర్థము తొమ్మిది రెండు పదు నొకండు అయినది. కాని దీనికి నిజమైన అర్థము भाग गया (పరుగెత్తి పోయెను) ఇట్టిదే ముహావరా

ని, ను అర్థములో వచ్చు వాక్యములకు ఉదాహరణములు .

जमीन्दार ने गान्धी जी का स्वागत किया। = జమీందారు గాంధీగారిని అహ్వానించెను. ఈ వాక్యమునందు जमीन्दार, गान्धी ఈ రెండును నామవాచకములు गाधी అను నామవాచకము నకు ఎదుట का వచ్చుటను గమనింపుము.

तुम किसका ध्यान करती हो? నీవు ఎవరిని తలంచు చున్నావు? ఈ వాక్యమునందు तुम, कौन రెండున్ను సర్వనామ ములు कौन అను రెండవ సర్వనామముతో का వచ్చుటను గమ నింపుము (कौन + का = किसका)

वह पति का अनादर करती है। = ఆమె భర్తను అవ మాన పరచుచున్నది. ఈ వాక్యమునందు वह అనునది సర్వ నామము पति అనునది నామవాచకము. पति అను నామ వాచకముతో का వచ్చుటను గమనింపుము.

डाक्टर मेरा कुछ नहीं कर सकेगा। =డాక్టరు నన్నేమియు చేయజాలడు ఈ వాక్యమునందు डाक्टर అనునది నామవాచ కము. मैं అనునది సర్వనామము. मैं అను సర్వనామముతో का వచ్చుటను గమనింపుము. (मैं + का=मेरा)

**बातूनी मीना पुरुषों के भी दांत खट्टे करती रही ।** =మాట నేర్పరియగు మీన పురుషులను కూడ ఓడించుచు వచ్చెను. ఈ వాక్యమునందు **मीना, पुरुष** రెండున్ను నామవాచకములు **पुरुष** అను రెండవ నామవాచకముతో **के** వచ్చుటను గమనింపుము.

**उसने चिट्ठी के टुकड़े टुकड़े कर डाले ।** = అతడు ఉత్తరము ముక్కలు ముక్కలుగా చింపివేసెను ఈ వాక్యమునందు **वह** సర్వనామము (**वह + ने = उसने**) **चिट्ठी** నామవాచకము ఈ **चिट्ठी** అను నామవాచకమునకు పిదప **के** వచ్చుటను గమనింపుము.

**तुम क्यों अपने पति की बेइज्जती करती हो ?** =నీ వెందుకు నీ భర్తను అవమాన పరచుచున్నావు ? ఈ వాక్యమునందు **तुम** సర్వనామము. **पति** నామవాచకము **पति** అను నామవాచకమునకు పిదప **की** వచ్చుటను గమనింపుము

**तुम भवन के सामने मेरी प्रतीक्षा करो ।** = నీవు భవనమునకు ఎదుట నాకై నిరీక్షింపుము ఈ వాక్యమునందు **तुम, मैं** రెండున్ను సర్వనామములు **मैं** అను రెండవ సర్వనామముతో **की** వచ్చుటను గమనింపుము (मैं + की=मेरी)

పై ఉదాహరణములో స్థూలాక్షరములలో నుండునది ముహావరా

కీ, కు అర్థములో వచ్చు వాక్యములకు ఉదాహరణములు.

**भगवान कृष्ण ने पांडवों का साथ दिया था ।** = భగవంతుడగు కృష్ణుడు పాండవులకు సహాయముచేసియుండెను ఈ వాక్యము

నందు कृष्ण, पंडित రెండున్ను నామవాచకములు. రెండవదిగ వచ్చు पंडित అను నామవాచకమునకు పిదప का వచ్చుటను గమనింపుము.

मै वहाँ तुम्हारा कोई न कोई काम करूँगी। = నేను అచ్చట మీకు ఏదైన పనిచేసెదను ఈ వాక్యమునందు मै, तुम రెండును సర్వనామములు. రెండవదిగ వచ్చు तुम అను సర్వనామముతో का చేరి వచ్చుటను గమనింపుము (तुम + का = तुम्हारा)

मामा ने इसका कुछ उत्तर नही दिया। = మామ దీనికి ఏమియు బదులు ఇవ్వలేదు ఈ వాక్యమునందు मामा నామవాచకము, यह సర్వనామము రెండవదిగావచ్చు यह అను సర్వనామముతో का వచ్చుటను గమనింపుము (यह + का = इसका)

ललिता ने मर्दों के भी दांत खट्टे करती रही। = లలిత పురుషులకుకూడ కప్పమిచ్చుచు వచ్చెను. ఈ వాక్యమునందు ललिता, पुरुष రెండును నామవాచకములు. రెండవదిగావచ్చు पुरुष అను నామవాచకముతో के వచ్చుటను గమనింపుము

वह दीन दुखियों की हमेशा मदद करता था। = అతడు బీదలకు ఎల్లప్పుడు సహాయము చేయుచుండెను ఈ వాక్యమునందు वह అనునది సర్వనామము दीन, दुखी నామవాచకము. రెండవదిగావచ్చు दीन दुखी అను నామవాచకమునకు పిదప की వచ్చుటను గమనింపుము.

పైన చెప్పిన ఉదాహరణములలో రెండవదిగావచ్చు నామవాచకము లేక సర్వనామములతో का, के, की అను చేర్పి

యున్నాము. ఈ విభక్తి ప్రత్యయములను మొట్టమొదటివచ్చు నామవాచకము లేక సర్వనామముతో కూడ ఉపయోగించ వచ్చును

तारा का राममूर्ति स्वागत करता है। = తారాను రామ మూర్తి ఆహ్వానించుచున్నాడు ఈ వాక్యమునందు మొట్ట మొదటవచ్చు तारा అను నామవాచకముతో का వచ్చుటను గమ నింపుము. ( राममूर्ति तारा का स्वागत करता है )

इसका भगवान भला करेगा। = ఇతనిని భగవంతుడు కాపా డును ఈ వాక్యమునందు మొట్టమొదటవచ్చు यह అను సర్వ నామముతో का వచ్చుటను గమనింపుము ( यह+का=इसका ) (भगवान उसका भला करेगा)

चिट्ठी के उसने टुकडे टुकडे कर डाले। = అతడు ఉత్తర మును ముక్కలు ముక్కలుగ చింపివేసెను. ఈ వాక్యమునందు మొట్టమొదటవచ్చు चिट्ठी అను నామవాచకముతో के వచ్చు టను గమనింపుము. (उसने चिट्ठी के टुकडे टुकडे कर डाले)

उनके लक्ष्मीबाई ने दांत खट्टे कर दिये। = వారిని లక్ష్మి బాయి ఓడించెను ఈ వాక్యమునందు మొట్టమొదట వచ్చు वे అను సర్వనామముతో के వచ్చుటను గమనింపుము (वे+के= उनके) (लक्ष्मीबाई ने उनके दांत खट्टे कर दिये)

पति की वह बेइज्जती करती है। = భర్తను ఆమె అవ మానపరచుచున్నది ఈ వాక్యమునందు మొట్టమొదటవచ్చు पति

तेरी मुझ पर विशेष कृपा है ?
मुझ पर तेरी विशेष कृपा है ?
} మీకు నాపై అధిక దయ వున్నదా ?

పైచెప్పిన ఉదాహరణములలో सहायक, गुरु, अधिकार, दया, कृपा ఇవి కర్తతో ఏర్పైన ఒకసంబంధమును చూపుచున్నది.

క్రింది ఉదాహరణమును బాగుగా గమనింపుము.

मै ने उसको बुलाया । = నేను వానిని పిలిచితిని
उसने मुझे मारा । = అతడు నన్ను కొట్టెను.
तुमने इसे पैसा दिया । = నీవు వీనికి డబ్బు ఇచ్చితివి

ఈ ఉదాహరణమునందు बुलाया, मारा, दिया ఇవి వట్టి క్రియలు ఇవి 'ముహావరా' కాదు. దాని వలన రెండవదిగా వచ్చు (రేఖాంకితము చేయబడియుండునది) సర్వనామములో को ప్రత్యయము వచ్చుటను గమనింపుము ఈ సర్వనామములో का, के, की ప్రత్యయము రాదు

జీవరాసులలో రెండు విధములున్నవి 1. ప్రాణి, 2. అప్రాణి ప్రాణముండుదానిని ప్రాణివాచకమనియు, ప్రాణము లేనిదానిని అప్రాణివాచకమనియునందురు

प्राणिवाचक :— आदमी, जानवर, बैल, पक्षी, मछली

अप्राणिवाचक :— पेड़, घर, मंदिर, जंगल, दूकान

"కి, కు" అర్థమునిచ్చునటువంటి 4-వ విభక్తియైన 'को', ప్రాణివాచక పదములలోనే ఉపయోగించవలయును. అప్రాణివాచక పదములలో ఉపయోగించకూడదు. దానికి

బదులుగా ఆ అప్రాణివాచకమునకు में ఉపయోగించవలయు
నని చెప్పుచున్నారు ఈ అప్రాణివాచకమునకు को కు బదు
లుగా में ఉపయోగించుట మంచి వ్యాకరణము. ఉండినప్పటి
కిన్ని ఆ అప్రాణివాచకమునకు కూడ को ఉపయోగించ
వచ్చును ఇది తప్పుకాదు में ఉపయోగించవచ్చును, को కూడ
ఉపయోగించవచ్చును, రెండును ఉపయోగించక వదలికూడ
పెట్టవచ్చును. దీనిని తప్పుగా తీసకొనరు

वह घर जाता है।
वह घर में जाता है। } అతడు ఇంటికి పోవుచున్నాడు
वह घर को जाता है।

ये लड़के पाठशाला गये।
ये लड़के पाठशाला में गये। } ఆ పిల్లలు పాఠశాలకు పోయిరి.
ये लड़के पाठशाला को गये।

मै जंगल गया।
मै जंगल में गया। } నేను అడవికి పోతిని
मै जंगल को गया।

तुम मंदिर जाते हो।
तुम मंदिर में जाते हो। } నీవు మందిరమునకు పోవుచున్నావు.
तुम मंदिर को जाते हो।

పైన చెప్పబడిన వాక్యములలో घर, पाठशाला, जंगल, मंदिर ఈ నాలుగు పదములు అప్రాణివాచకములు మొదటి వాక్యమునందు को అను విభక్తి ప్రత్యయము చేర్చబడలేదు

రెండవ వాక్యమునందు ने అను విభక్తిప్రత్యయము చేర్చబడి యున్నది. మూడవ వాక్యమునందు को అను విభక్తిప్రత్యయము చేర్చబడియున్నది. కావున దీనిని ఇష్టమువచ్చినట్లు ఉపయోగించవచ్చును.

ఇచ్చట అప్రాణివాచకమునకు మాత్రమే యీ నియమమును, ఉదాహరణమును చెప్పబడియున్నది ప్రాణివాచకమునకు ఇదంతయు అక్కరలేదు ఏలనగా ప్రాణివాచకమునకు సాధారణముగా ఈ को వచ్చును.

**उसने बैल को चारा दिया।** = అతడు ఎద్దుకు మేతవేసెను ఈ వాక్యమునందు बैल ప్రాణివాచకము. కావున "ఎద్దుకు" అని చెప్పునపుడు ఈ को తప్పక వచ్చును

వీనికి, వానికి, నీకు, నాకు, ఇద్దరికిన్ని అను అర్థములో వచ్చునపుడు ఈ నాలుగవ విభక్తియైన को కు బదులుగా ने వచ్చును

1 రెండున్ను నామవాచకములుగనుండిన (ఏకవచనముగా లేక బహువచనముగా నుండినను) రెండవదిగావచ్చు నామవాచకమునకు ने వచ్చును

2. రెండును సర్వనామములుగా నుండిన రెండు సర్వనామములకును ने వచ్చును

3 మొదటిది సర్వనామము, రెండవదిగా వచ్చునది నామవాచకముగనుండిన రెండు పదములకును ने వచ్చును

4. మొదటిది నామవాచకము, రెండవదిగా సర్వనామమువచ్చిన రెండవ పదమునకు ने వచ్చును

5 మొదటిది నామవాచక బహువచనము, రెండవది సర్వ నామమువచ్చిన రెండు పదములలోను मैं వచ్చును.

## उदाहरण.

मोहन और गोपाल में विरोध हुआ। = మోహనునికి, గోపాలునికి విరోధము కలిగెను దీనిలో मोहन, गोपाल రెండును నామ వాచకములు రెండవదిగా వచ్చు गोपाल అను నామవాచకముతో में వచ్చుటను గమనింపుము

इसलिये अरबों और फिरंगियों में झगडा शुरू हो गया। = ఇందు వలన అరబ్బులకు, ఆంగ్లేయులకు యుద్ధ మారంభమయ్యెను ఈ వాక్యమునందు రెండవదిగావచ్చు फिरंगियों అను నామవాచక బహు వచనముతో में వచ్చియుండుటను గమనింపుము

उसमें और मुझ में लड़ाई छिड गयी। = వానికి నాకు జగ డము ప్రారంభమయ్యెను ఈ వాక్యమునందు वह, मै రెండున్ను సర్వనామములు రెండు సర్వనామములకున్ను में వచ్చుటకు గమ నింపుము (वह + में = उस में, मै + में = मुझ में)

मै जानता हूँ कि आप में और मनोहर में बडी मित्रता है। = తమకున్ను మనోహరునికిన్ని గొప్ప స్నేహమున్నదని నే నెరుగుదును దీనిలో आप సర్వనామము, मनोहर నామవాచకము. రెండవదిగా వచ్చు मनोहर అను నామవాచకముతో में వచ్చుటను గమనింపుము

क्या तुम जानते हो कि गोखले और मुझ में क्या फ़रक है ?= గోఖలేకున్ను, నాకున్ను ఏమి భేదాయున్నదో నీ వెరుగుదువా ?

దీనిలో గోపాల్ నామవాచకము మై సర్వనామము రెండవదిగా వచ్చు మై అను సర్వనామపదంతో మేం వచ్చుటను గమనింపుము. (मैं + में = मुझमें)

वह समझे कि और मर्दों में और मुझ में कितना अंतर है । = అతడు ఇతర పురుషులకున్ను, నాకున్ను ఎంత భేదా యున్నదో తెలిసికొనుగాక దీనిలో मर्दों నామవాచక బహువచనము మై సర్వ నామము, రెండవదిగావచ్చు సర్వనామముతో में వచ్చుటను గమ నింపుము (मैं + में = मुझमें)

मैंने कुछ रोटियाँ खरीदकर दोनों में बाँट दी । = నేను కొన్ని రొట్టెలను కొని ఇద్దరికిన్ని పంచితిని. దీనిలో दोनों అను పదములో में వచ్చుటను గమనింపుము

పై చెప్పబడిన में కు బదులుగా का, के, की ల కూడ ఉపయోగించవచ్చును

गोपाल और अनसूया का व्याह अभी न हुआ । = గోపాలుని కిని, అనసూయకును ఇంకను వివాహము కాలేదు దీనిలో गोपाल, अनसूया రెండున్ను నామవాచకములు రెండవదిగవచ్చు अनसूया అను నామవాచకముతో का వచ్చుటను గమనింపుము

इसी में मेरा और तुम्हारा दोनों का कल्याण है । = దీనిలోనే నీ మేలున్ను, నా మేలున్ను ఇద్దరిదిన్ని ఇమిడియున్నది. దీనిలో मैं, तुम అను సర్వనామములతో का వచ్చుటను గమనింపుము.

इस जन्म में तो मेरा उनके साथ का संबन्ध छूटेगा नहीं । = ఈ జన్మములో నాకున్ను అతనికిన్ని సంబంధము వదలిపోదు దీనిలో मैं తో का ను, वे తో के యును వచ్చుటను గమనింపుము.

कभी कभी मेरी और मेरे पति की किसी न किसी बात पर झगडा चढ जाता था। = అప్పుడప్పుడు నాకున్ను నాభర్తకున్ను ఏదో ఒక విషయమునుగురించి జగడము జరుగుచుండెను. దీనిలో मे తో కూడ की, के వచ్చుటను గమనింపుము

పై చెప్పబడిన में, का, के, की లకు బదులుగా మొట్ట మొదట का ను, రెండవదిగా से కూడ ఉపయోగించవచ్చును. లేక మొట్టమొదట से రెండవదిగా का కూడ ఉపయోగించ వచ్చును.

भाषा का व्याकरण से क्या संबंध ? = భాషకు, వ్యాకరణ మునకు ఏమి సంబంధము ?

आप का इस मामले से थोडा भी संबध नहीं है। =మీకున్ను ఈ విషయమునకున్ను కొంచెముకూడ సంబంధము లేదు.

इसका क्षत्रियों से विशेष संबंध है। = దీనికి, క్షత్రియులకు అధిక సంబంధమున్నది.

उनका अपने सरदारों से झगडा हो गया। = వారికిని తమ సర్దారులకును జగడము ఏర్పడెను.

పై చెప్పబడిన నాలుగు వాక్యములలో మొదట का, పిదప से వచ్చుటను గమనింపుము. పై చెప్పబడిన వాక్యములను ఇట్లున్ను మార్చి ఉపయోగించవచ్చును.

व्याकरण से भाषा का क्या संबंध ?

इस मामले से आप का थोडा भी संबध नही है।

क्षत्रियों से इसका विशेष संबंध है।

अपने सरदारों से उनका झगड़ा हो गया।

बारह वर्ष से कम उम्रवाली पत्नी से पति का संबंध बहुत बुरा है। = పంౘరెండు సంవత్సరములకన్న తక్కువ వయస్సుగల భార్యతో పెర్తకుగల సంబంధము చాల చెడుపు.

उद्योगी करण से गृह उद्योग धंधों का कोई बैर नहीं है। = కార్మికసాధనములకును కుటీర పరిశ్రమలకును ఏ విరోధమును లేదు.

आज आनन्द से तुम्हारी मुलाकात हुई? = నేడు నీకు ఆనందసునికి సంధింపు ఏర్పడినదా?

उनसे हमारी जान पहचान नहीं। = వారికిన్ని మాకున్ను పరిచయము లేదు.

పై చెప్పబడిన నాలుగు వాక్యములలో మొదట से, రెండవది का, की వచ్చుటను గమనింపుము ఈ వాక్యములను యీ విధముగా మార్చికూడ ఉపయోగించవచ్చును.

पति का बारह वर्ष से कम उम्रवाली पत्नी से संबंध बहुत बुरा है।
गृह उद्योग धंधों का उद्योगी करण से कोई बैर नहीं है।
आज तुम्हारी आनंद से मुलाकात हुई?
हमारी उनसे जान पहचान नहीं।

ఒక వాక్యమునందు ఒక సర్వనామమును వేరొక సర్వనామముతో పోల్చునప్పుడుకూడ ఆ రెండు సర్వనామములతో का అను విభక్తి ప్రత్యయము చేర్చవలయును. అట్లు చేర్చిన ఆ का విభక్తిప్రత్యయము చతుర్థివిభక్తి ప్రత్యయమైన को అర్థము నిచ్చును.

ప్రశ్న వాచకమునకును సర్వనామమునకును సంబంధ ముండినను కూడ, ఆ సర్వనామముతో का విభక్తి ప్రత్యయము చేర్చవలయును. ఇచ్చటకూడ ఈ का విభక్తి ప్రత్యయము చతుర్థీ విభక్తి ప్రత్యయమైన को అర్థము నిచ్చును.

फिर मेरा उसका प्रेम कैसे हो सकता है ? = పిదప నాకు అతనికి ప్రేమ ఎట్లు కలుగును ?

मेरी उसकी क्या तुलना ? = నాకు అతనికి ఏ సామ్యమున్నది ?

आप का उनका परिचय कैसे हुआ ? = మీకు వారికి ఎట్లు పరిచయము కలిగెను ?

तेरा इसका क्यों विरोध हुआ ? = నీకు ఇతనికి ఎందుకు విరోధము యేర్పడెను ?

अब इनका हमारा नाता नहीं है । = ఇప్పుడు వీరికి మాకు సంబంధము లేదు.

इससे तुम्हारा क्या बिगड़ता है ? = దీనివలన నీకు కలుగు కీడేమి ?

यहाँ मेरा कौन होता है ? = ఇచ్చట నా కెవరున్నారు ?

इस रुपये से मेरा कितना कल्याण होगा ? = ఈ రూపాయివలన నా కెంత మేలు కలుగును ?

वह जाये न जाये हमारा क्या होता है ? = అతడు వెళ్ళినను లేక వెళ్ళకపోయినను మా కేమి ?

ऐसे अच्छे व्यापार में उसका नुकसान कैसे हुआ ? = ఇటువంటి మంచి వ్యాపారమునందు అతనికి నష్ట మెట్లు ఏర్పడెను ?

ఒకటితో ఒకటి రక్తసంబంధముండిన కర్తతో నాలుగవ విభక్తియైన को కు బదులుగా के మాత్రము వచ్చును. ఆ రక్త

సంబంధము స్త్రీలింగముగనుండినను లేక పుంలింగముగనుండినను के లో ఎటువంటి మార్పునుండదు. స్త్రీలింగ, పుంలింగ ఏకవచనముల ననుసరించి కర్తతో का, की రాదు.

**मेनका के एक कन्या हुई ।** = మేనకకు ఒక ఆడబిడ్డ పుట్టెను. ఈ వాక్యమునందు మేనకకు మరియు కన్యకకును రక్తసంబంధమున్నది కన్య స్త్రీలింగముగనుండినను కర్తతో के వచ్చుటను గమనింపుము.

**उसके एक ही लड़का था ।** = అతనికి ఒకే కొడుకుండెను, ఈ వాక్యమునందు అతనికి, కొడుకునకు రక్త సంబంధము ఉండుటవలన కొడుకు పుంలింగ ఏకవచనముగ నుండినను కర్తతో के వచ్చుటను గమనింపుము.

**उसके एक टांग न थी ।** = అతనికి ఒక కాలు లేదు. ఈ వాక్యమునందు అతనికిన్ని కాలునకును రక్త సంబంధముండుట వలన टांग స్త్రీలింగ ఏకవచనముగనుండినను కర్తతో के వచ్చుటను గమనింపుము

## और भी कुछ उदाहरण

**उत्तानपाद के दो रानियाँ थीं ।** =ఉత్తానపాదునికి ఇద్దరు భార్యలుండిరి.
**गुणवती के एक लड़की हुई ।** = గుణవతికి ఒక కూతురు పుట్టెను.
**उसके कोई संतान न थी ।** = అతనికి ఒక బిడ్డయును లేదు.
**उनके कन्या कहाँ से आयी ?** =వారికి కూతురు ఎచ్చటనుండివచ్చెను?
**नासिरुद्दीन के सलीमा नाम की एक ही औरत थी ।** = నాసిరుద్దీనుకు సలీమా అను పేరుగల ఒకే భార్యయుండెను

ब्रिटिश रानी के बेटा पैदा हुआ । = ఆంగ్లేయరాణికి కొడుకుపుట్టెను

माँ, भाभी के बच्चा हुआ है। = తల్లీ, వదినకు బిడ్డ పుట్టియున్నది

अल्तमश के कई लड़के थे । = అల్తమష్ కు అనేక కొడుకులుండిరి

मेरे कई छोटे भाई बहन हैं। = నాకు అనేక సోదర, సోదరీమణు లున్నారు

मेरे भी ऐसे ही सुन्दर दो बच्चे थे। = నాకు కూడ ఇట్టి అందమైన ఇద్దరు కొడుకులుండి

मेरे पति के दो विवाह हो चुके हैं। = నా భర్తకు రెండు వివాహములయియున్నవి.

उनके और भी पाँच सात बच्चे हैं । = వారికి ఇంకను ఐదారుగురు బిడ్డలున్నారు

उनके एक लड़का और एक लड़की पैदा हुई । = వారికి ఒక కొడుకును ఒక కూతురును పుట్టిరి

भीमसेन के तीन पुत्र थे और एक पुत्री थी । =భీమసేనునికి ముగ్గురు పుత్రులుండిరి, మరియు ఒక పుత్రిక నుండెను

## से, का दूसरा प्रयोग

ఇతరులతో మాటలాడు సమయమునను లేక ఇతరులను ఏదో ఒక విషయమును, వస్తువును అడుగు సమయమునను లేక ఇతరులతో సంధించు సమయమునను, అతడు ఎవనితో మాట లాడునో లేక ఎవరిని ఒక విషయమును లేక వస్తువును అడుగునో లేక ఎవరితో సంధించునో ఆ నామవాచకము లేక సర్వనామ ముతో को కు బదులుగా से విభక్తి ప్రత్యయము చేర్చెదము.

## पर, का दूसरा प्रयोग

(1) पर అనుదానికి సామాన్యార్థము "మీద" కాని ప్రతిదినము వచ్చిపోవునటువంటి అందరికిన్ని సొంతమైన ప్రదేశముగనుండిన ఆ ప్రదేశముతో को కు బదులుగా पर ఉపయోగించవలయును.

(2) ఒక మనిషికి సొంత ప్రదేశముగనుండిన ఆ ప్రదేశముతో में, को లకు బదులుగా पर వచ్చును ఈ ప్రదేశములకు को, में లకు బదులుగా पर ఉపయోగించుట ఒకనుంచి వ్యాకరణ నియమము.

कमलेशन हवा खाने नदी पर जाता है। = కమలేశుడు గాలిపీల్చుటకు నదివైపుపోవుచున్నాడు ఈ వాక్యమునందు నది అను ప్రదేశము కమలేశునికి ఒకనికే సొంతమైనది కాదు. అందరికిన్ని సొంతమైనది. కాన ఇచ్చట को కు బదులుగా पर ఉపయోగించవలయును ముందటిపాఠములో (80, 81 పేజీలలో) అప్రాణివాచకమునకు को విభక్తి ప్రత్యయను చేర్చ కూడదనియు, దానికి బదులుగా में చేర్చవలయునని చెప్పియుంటిమి. కాన ఇప్పుడు ఈ నది అను అప్రాణివాచకమునకు पर కు బదులుగా में ఎందుకు ఉపయోగించకూడదను సందేహము కలుగవచ్చును. కాని నది అను ప్రదేశము అందరికిన్ని సొంతమైన ప్రదేశముగానుండుటవలన में కూడ రాదు

कमलेशन ने नदी पर मुझ से भेंट की। =కమలేశుడు నన్ను నది గట్టున సంధించెను. ఈ వాక్యమునందు నదిగట్టున అను దానికి नदी में అనికూడ రాదు नदी पर అనియే రావలయును.

मै स्टेशन पर ठीक समय पर आ पहुँचा। = నేను రైలు స్టేషనుకు సరియైన సమయమునకు పోయి చేరితిని. ఈ వాక్యమునందు రైలు స్టేషను అందరికిన్ని సొంత ప్రదేశముగానుండుట వలన स्टेशन पर అని వచ్చుటను గమనింపుము. ( स्टेशन को या स्टेशन में అని రాదు. )

मै ने स्टेशन पर उसको देखा। = నేను స్టేషనునందు అతనిని చూచితిని. ఇచ్చట స్టేషనులో అనుదానికి स्टेशन में అనియు రాదు.

मेरे पिताजी हवाई अड्डे पर चले। = నా తండ్రి విమాన నిలయమునకు పోయెను. ఈ వాక్యమునందు విమాన నిలయము అందరికిన్ని చెందిన ప్రదేశముగ నుండుటవలన हवाई अड्डे पर అని వచ్చుటను గమనింపుము

मेरे भाई भी हवाई अड्डे पर होंगे। = నా సహోదరుడు కూడ విమాన నిలయమునందు ఉండవచ్చును ఈ వాక్యమునందు విమాననిలయమునందు అనుటకు हवाई अड्डे में అని రాదు.

आप को अपने बंगले पर ले जाता हूँ। = మిమ్ములను నా భవనమునకు తీసికొనిపోవుచున్నాను ఈ వాక్యమునందు बंगला అనునది అతని సొంత ప్రదేశముగనుండుటవల్ల में, को లకు బదులుగా पर వచ్చుటను గమనింపుము.

मैने बंगले पर तुमसे मिला। =నేను భవనమునందు నిన్ను సంధించితిని. ఇచ్చట में కు బదులుగా पर వచ్చుటను గమనింపుము.

सरला अपने पति के यहाँ जाने का विचार कर रही है। = సరళ తన భర్త ఇంటికి వెళ్ళుటకు ఆలోచించుచున్నది

कल ही विदर्भ पहुँचने का प्रयत्न कीजिये। — రేపటికే విదర్భదేశము చేరుటకు ప్రయత్నము చేయుండి.

उसने मुझे ढूँढ निकालने का एक उपाय सोचा। — అతడు నన్ను వెదకుటకు ఒక ఉపాయమును కనిపెట్టెను.

रिआया का पैसा खर्च करने का मुझे क्या हक है? = ప్రజల డబ్బును ఖర్చుచేయుటకు నాకేమి అధికారము కలదు?

प्राचीन ऋषियों ने वासनाओं का दमन करने के दो साधन बताये हैं। = ప్రాచీన ఋషులు కోర్కెలను అణచుటకు రెండు ఉపాయములను చెప్పియున్నారు.

दो कुत्ते लडने के बाद आमने सामने बैठे रहते हैं। = రెండు కుక్కలు పోట్లాడిన పిదప ఎదురెదురుగా కూర్చొని యున్నవి

सुभद्रा के पास जाने के बदले वह कुएँ में गिरना अच्छा समझते थे। సుభద్రవద్దకు పోవుటకంటె వారు, బావిలోపడుట మంచిదని తలచియుండిరి

वह अब अपने बलबूते पर खडे होने के योग्य होता जाता था। = అతడిప్పుడు తన బలముపై ఆధారపడుటకు యోగ్యుడుగా అగుచుండెను

इसे भरने के पहले पिछली तरफ की सूचनाओं को जरूर पढ लें। = దీనిని పూర్తి చేయుటకు ముందు వెనుక ప్రక్కనుండు విషయములను తప్పక చదువవలెను.

दमयंती ने खुद अपने पति के पास जाने की अनुमति मांगी। = దమయంతియే తన భర్తఇంటికి పోవుటకు అనుమతి అడిగెను.

अब और कोई समाचार सुनने की इच्छा नहीं है। = ఇప్పుడు వేరేదైన విషయమును వినుటకు ఇష్టము లేదు

उसने यह काम करने की कोशिश की। = అతడు ఈ పనిచేయు
టకు ప్రయత్నించెను

उसको रोज दूध पीने की आदत है। = అతనికి రోజు పాలు త్రాగు
అలవాటున్నది

ताजमहल देखने में बहुत सुन्दर है। = తాజ్‌మహల్ చూచుటకు
చాల అందముగానున్నది

वहाँ पहुँचने में बड़ी देर हो गयी। =అచ్చటికి పోయి చేరుటకు చాల
ఆలస్యమయ్యెను

## जाना, बोलना आदि क्रिया का प्रयोग

ఒక వాక్యమునందు క్రియమాత్రము వచ్చిన ఆ క్రియ అవశ్యకతను తెలుపును ఉ — मुझे जाना है। = నేను పోవలసియున్నది ఈ వాక్యమునందు जाना అను క్రియ పోవలసియుండు అవశ్యకతను తెలుపుచున్నది ఇట్టి వాక్యములందు కర్తతో को విభక్తి ప్రత్యయము చేర్చవలయును. ఇచ్చట కర్తతో को విభక్తి ప్రత్యయము చేర్చుటచే క్రియ కర్తననుసరించిమారదు, కర్మననుసరించి మారును.

मुझे जाना है। = నేను పోవలసియున్నది

मुझे जाना था। = నేను పోవలసియుండెను

मुझे जाना होगा। = నేను పోవలసియుండును

तुमको बोलना है। = నీవు మాటలాడవలసియున్నది

तुमको बोलना था। = నీవు మాటలాడవలసియుండెను

तुमको बोलना होगा। = నీవు మాటలాడవలసియుండును

उसको बात करनी है। = అతడు మాటలాడవలసియున్నది
उसको बात करनी थी। = అతడు మాటలాడవలసియుండెను.
उसको बात करनी होगी। = అతడు మాటలాడవలసియుండును

हमको बैठना है। = మేము కూర్చొనవలసియున్నది.
हमको बैठना था। = మేము కూర్చొనవలసియుండెను
हमको बैठना होगा। = మేము కూర్చొనవలసియుండును.

उनको पढ़ना है। = వారు చదువవలసియున్నది
उनको पढ़ना था। = వారు చదువవలసియుండెను
उनको पढ़ना होगा। = వారు చదువవలసియుండును

इनको चिट्ठी लिखनी है। = వీరు జాబు వ్రాయవలసియున్నది
इनको चिट्ठी लिखनी थी। = వీరు జాబువ్రాయవలసియుండెను
इनको चिट्ठी लिखनी होगी। = వీరు జాబువ్రాయవలసియుండును

मोहन को काम करना है। = మోహనుడు పనిచేయవలసియున్నది
मोहन को काम करना था। = మోహనుడు పనిచేయవలసియుండెను
मोहन को काम करना होगा। = మోహనుడు పనిచేయవలసియుండును

सरला को खेलना है। = సరళ ఆటలాడవలసియున్నది
सरला को खेलना था। = సరళ ఆటలాడవలసియుండెను.
सरला को खेलना होगा। = సరళ ఆటలాడవలసియుండును

इसको ठहरना है। = వీడు బసచేయవలసియున్నది
इसको ठहरना था। = వీడు బసచేయవలసియుండెను
इसको ठहरना होगा। = వీడు బసచేయవలసియుండును

आपको किताब खरीदनी है। = తమరు పుస్తకము కొనవలసియున్నది.

आपको किताब खरीदनी थी । = తమరు పుస్తకము కొనవలసి యుండెను

आपको किताब खरीदनी होगी । = తమరు పుస్తకము కొనవలసి యుండును

క్రియ ఒక నామవాచకముతో వచ్చినచో కర్తతో को చేరును. ఆ को కు ఏ అర్థము నుండదు ताश, शादी दखल, स्नान మొదలైనవి నామవాచకములు. खेलना, करना, देना, बैठना మొదలైనవి క్రియలు. (ताश खेलना, शादी कर लेना, दखल देना, स्नान करना) ఈ విధముగా క్రియ ఒక నామవాచకముతో చేరి వచ్చినచో కర్తతో को చేరును, ఆ को కు ఏ అర్థము లేకుండుటను గమనింపుము

लड़कों को ताश खेलना ठीक नहीं है । = బాలురు పేకాట ఆడుట సరికాదు.

मुझे छोटी उमर में ही शादी कर लेना उतनी अच्छी बात नहीं है । నేను బాల్యముననే పెండ్లిచేసికొనుట అంత మంచిదికాదు.

आप को उनके काम में दखल देना आप की शोभा नहीं है । = మీరు అతని పనికి ఆటంకముగానుండుట మంచిదిగాదు.

उन्हें सूरज निकलने के पहले ही स्नान करना था । = వారు సూర్యు డుదయించకమునుపే స్నానము చేయవలసి యుండెను.

उसको बड़ों के सामने बैठना बहुत बुरा है । అతడు పెద్దవారల ఎదుట కూర్చుండుట సరిగాదు

పై చెప్పబడిన ఉదాహరణములలో స్థూలాక్షరములలో నుండు వానిని గమనించిన ఒకటి నామవాచకము, మరి యొకటి క్రియ యని తెలియగలదు.

యొత్తినవన్నె చేతఁ గూర్చున్నపీఁట నయిత మెత్తిగాఁ దోఁచుచుండెననియు, వీణ మీటుటకై తొమ్మున నానించుకొనఁగా నా వీణకు నమర్చిన సొఱకాయలు స్తనములపై నొఱగియుండె ననియు, వ్రేళ్లతో మీటునపుడు తంత్రులవలనఁ బుట్టిన నాదముతో నవ్యక్తమధురమయిన సన్నని కంఠనాదము లయించి, మనోహరముగా వినఁబడుచుండె ననియు, రాగ మాలాపన చేయునప్పుడు గలిగిన యానందపరవశత్వము సంభోగకాలమునందలి పరవశత్వమును బోలి యుండె ననియు, వీణయందుఁ బలికించునట్టి కృతులకుఁ జేతి కంకణములయొక్క ఝణఝణ యనెడి ధ్వనులు తాళములు వేసినట్లుండె ననియు - ఇట్లు హాయిగా వీణ వాయించుచుండె యని తాత్పర్యము. అలం. తద్గుణము, నిదర్శన, రూపకమును.

ఉ. అబ్బురపాటుతోడ నయ ♦ నాంబుజముల్ వికసింపఁ గాంతి వె
ల్లుబ్బ కనీనికల్ వికసి ♦ తోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బ మెఱుంగుఁజన్గవ గ ♦ గుర్పొడువన్ మదిలో[1]ని కోరికల్
గుబ్బ[2]తిలంగఁ జూచె నల ♦ కూబరసన్నిభు నద్ధరామరున్. 28

టీ. అబ్బురపాటుతోడన్ = అచ్చెరుపాటుతో; నయనాంబుజముల్ = కన్నుదామరలు; వికసింపన్ = విరియఁబాఱఁగా; కాంతి = శోభ; వెల్లు ఉబ్బ = మిక్కిలిగా అతిశయించి; కనీనికల్ = కంటినల్లగ్రుడ్లు; వికసితోత్పలపంక్తులన్ = పూచిన కలువల మాలికలను; క్రుమ్మరింపఁగాన్ = నిండుకొలుపఁగా; గుబ్బ...కవ = పట్రువై నిగనిగనికాంతి గల స్తనద్వయము; గగుర్పొడువన్ = పులకాంకురములు కలది కాఁగా; మదిలోని = మనసులోని; కోరికల్ = వాంఛలు; గుబ్బతిలంగన్ = అతిశయింపఁగా; నలకూబరసన్నిభున్ = (చక్కఁదనముచేత) నలకూబరునిఁబోలిన; అద్ధరామరున్ = ఆ బ్రాహ్మణుని - ప్రవరుని; చూచెన్.

తా. ఈ విధముగా వీణ వాయించుచున్న యా దేవశాస్త్రీ యితరులెవ్వరును లేని తానున్న చోటికి సుందరుండైన యా ప్రవరుఁడు రాఁగానే, చూపులు భ్రమింప, దేహము గగుర్పొడువఁగా, మనసునందు లేనికోరికలు పుట్టుచుండఁగా నతని నాశ్చర్యముతోఁ జూచెను. అలం. పరిణామము. ఇందు అభిలాషము వ్యక్తము.

ఉ. చూచి [3]ఝణంఝణత్కటక ♦ సూచితవేగపదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము ♦ లేనడు మల్లలనాడ నయ్యెడం
బూచిన యొక్క పోఁకనును ♦ బోదియఁ జేరి [4]విలోకనప్రభా
వీచికలం దదీయపద ♦ [5]వీం గలశాంబుధి వెల్లిగొల్పుచున్. 29

టీ. చూచి = చూచినదై; ఝణంఝణ...విందయై - ఝణంఝణత్ = ఝణఝణమని మ్రోఁగుచున్న; కటక = అందెలచేత; సూచిత = తెలియఁజేయఁబడిన; వేగ = వడిగల; పదారవిందయై = పాదకమలములు గలదై; లేచి = కూర్చున్న పీఠమునందుండి లేచి; కుచంబులున్ = స్తనములును; తుఱుముత్ = కొప్పును; లేనడుము = సన్ననినడుమును; అల్లలనాడన్ = జవజవలాడఁగా - చలింపఁగా; అయ్యెడన్ = అచ్చట నున్న; పూచిన...బోదియన్ - పూచిన = పుష్పించిన; ఒక్క = ఒంటరిగానున్న; పోఁక నునుబోదియన్ = నునుపైన పోఁకమ్రాని కెందట;

1. లోనఁగోరికల్. పా. 2. టిలంగ. పా. 3. ఝళంఝళ. పా. 4. విలోచన. పా. 5. వీకలశాం. పా.

मुझे जरूर वहाँ ठहरना होगा। = నేను తప్పక అచ్చట బస చేయ వలసియుండును

तुमको अभी यह काम करना होगा। = నీవు ఇప్పుడే ఈ పని చేయ వలసియుండును.

उसको परसों यहाँ आना होगा। = అతడు ఎల్లుండి ఇచ్చటికి రావలసి యుండును

उनको बार बार दवा खानी होगी। = వారు అప్పుడప్పుడు మందు తినవలసియుండును

इसको यह किताब पढ़नी होगी। = ఇతడు ఈ పుస్తకము చదువ వలసియుండును

इनको आज की सभा में तकरीर देनी होगी। = వీరు నేటి సభలో ఉపన్యసించవలసియుండును

हमको सारी जमीन बेचनी होगी। = మేము పూర్తి నేలను అమ్మవలసియుండును

आपको यह जगह साफ करनी होगी। = తమరు ఈ చోటును శుభ్రము చేయవలసియుండును

## पड, का उदाहरण

राजू को उसके यहाँ जाना पडता है। = రాజు అతని ఇంటికి పోవలసివచ్చుచున్నది

भानुमति को मेरे यहाँ आना पड़ता है। = భానుమతి నా యింటికి రావలసివచ్చుచున్నది

मुझे यह चीज उसको देनी पड़ती है। = నేను ఈ వస్తువు అతనికి ఇవ్వవలసివచ్చుచున్నది

तुम को वह तसवीर देखनी पड़ती है। = నీవు ఆ పటమును చూడ వలసి వచ్చుచున్నది

उसको भी मेरे साथ खेलना पड़ेगा। = అతడుకూడ నాతో ఆట లాడవలసివచ్చును

उनको मैदान में शत्रु से लड़ना पड़ेगा। = వారు మైదానము నందు శత్రువులతో యుద్ధముచేయవలసివచ్చును.

इसको बाजार में एक कलम खरीदनी पड़ेगी। = ఇతడు బజారు నందు ఒక కలము కొనవలసివచ్చును

इनको अपने घर में ही शिक्षा प्राप्त करनी पड़ेगी। = వీరు తమ యింటియందే విద్య అభ్యసించవలసివచ్చును.

हमको आज उससे मिलना पड़ा। = మేము నేడు అతనిని సంధించ వలసివచ్చెను

आप को अचानक मेरे यहाँ आना पड़ा। = తమరు అకస్మాత్తుగ నా ఇంటికి రావలసివచ్చెను

उनको इस मेज के लिये सात रुपये देने पड़े। = వారు ఈ మేజా కొరకు ఏడు రూపాయలు యివ్వవలసివచ్చెను

इसको भूख के कारण दस केले खाने पड़े। = ఇతడు ఆకలి వలన పది అరటిపండ్లు తినవలసివచ్చెను

आज मुझे यह घटना देखनी पड़ी। = నేడు నేను ఈ సంభవ మును చూడవలసివచ్చెను.

रेणुका को यह बात मुझसे कहनी पड़ी। = రేణుక ఈ విషయము నాతో చెప్పవలసివచ్చెను

---

## चाहिये, का प्रयोग

**चाहिये** కు అర్థము "వలయును". దీనిని ఎప్పుడును క్రియతోనే చేర్చవలయును. అట్లు చేర్చునప్పుడు కర్తతో **को** విభక్తిప్రత్యయము తప్పక చేర్చవలయును. ఈ **को** కు ఏ అర్థము

నుండదు. కర్తతో **को** చేర్చిన క్రియ కర్మననుసరించి మారును. కర్తననుసరించి మారదు.

तुमको भी मेरी तरह कठिन परिश्रम करना चाहीये। = నీవుకూడ నావలె కఠినపరిశ్రమ చేయవలయును

तुमको अपनी माता की आज्ञा का पालन करना चाहिये। = నీవు నీ తల్లి ఆజ్ఞను నెరవేర్చవలయును.

तुम्हें इस बेचारे नल को दोष नहीं देना चाहिये। = నీవు పాపము ఈ నలుని తిట్టకూడదు

आपको मुझे ग्रहण करना चाहिये। = తమరు నన్ను స్వీకరింపవలయును

हमको मौत से नहीं डरना चाहिये। = మనము మరణమునకు భయపడకూడదు.

शकुंतला को तो अब पति के घर जाना चाहिये। = శకుంతల ఇప్పుడు పతిఇంటికి పోవలయును

इतना तो क्षत्राणी को सहन करना ही चाहिये। = ఇంతమాత్రము క్షత్రియస్త్రీ తప్పక సహించుకొనవలయును

कण्व महर्षि की पुत्री को ऐसा ही होना चाहिये। = కణ్వమహర్షి కూతురు ఇట్లే యుండవలయును.

सावित्री को उसे चुनना नही चाहिये। = సావిత్రి అతనిని ఎన్నుకొనకూడదు.

तुमको निर्धन पर दया दिखानी चाहिये। = నీవు పేదలపై దయ చూపవలయును.

मुझे किताब पढनी चाहिये। = నేను పుస్తకము చదువవలయును.

हमको देश की सेवा करनी चाहिये। = మనము దేశసేవ చేయవలయును.

उसको रोटी खानी चाहिये । = అతడు రొట్టె తినవలయును
इसको काफी पीनी चाहिये । = ఇతడు కాఫీ త్రాగవలయును

ఈ **चाहिये** ను "కావలయును" అను అర్థములో కూడ ఉపయోగించుకొనవలెను. ఈ సమయమున ఈ **चाहिये** క్రియ [illegible] ధాతువులతోనే వచ్చుటలేదు. ఇది నామవాచకములతోనే వచ్చును. కాని ఆ సమయమునను కర్తకు **को** విభక్తి ప్రత్యయమును చేర్చవలయును. కాని ఇట్టి వాక్యములలో ఈ **को** చతుర్థి విభక్తి అర్థమును ఇచ్చును.

मुझे एक रुपया चाहिये । = నాకు ఒక రూపాయ కావలయును
तुमको गुलाब चाहिये । = నీకు రోజాపువ్వు కావలయును.
उसको कलम चाहिये । = అతనికి కలము కావలయును
इसको किताब चाहिये । = ఇతనికి పుస్తకము కావలయును
उनको धन चाहिये । = వారికి ధనము కావలయును
इनको गाय चाहिये । = వీరికి ఆవు కావలయును
हमको एक घर चाहिये । = మాకు ఒక ఇల్లు కావలయును.
आपको कपड़ा चाहिये । = తమకు బట్ట కావలయును.
नागराज को फल चाहिये । = నాగరాజుకు ఫలము కావలయును
कमला को अच्छी साड़ी चाहिये । =కమలకు మంచి చీర కావలయును

పైన చెప్పబడిన ఉదాహరణములలో **रुपया, गुलाब, कलम** మొదలగునవి నామవాచకములని గమనింపుము.

"వలయును" అను అర్థములలోనే అవశ్యకతను గుర్తించుటకు **होगा** వచ్చును. వివశతను లేక బలాత్కారమును గుర్తించు

లదు **पड़ेगा** వచ్చును, గనుక ప్రయోగించునప్పుడు **होगा,** **पड़ेगा** వచ్చినను కర్తకు **को** చేర్చవలయును ఈ **को** కు అర్థముండదు

आपको मुझे भी साथ ले चलना होगा। — తమరు నన్నుకూడ, కూడ పిలుచుకొనిపోవలయును

तब तक इसको शाप का फल भोगना ही होगा। — అంతవరకు ఇతడు శాపముయొక్క ఫలమును అనుభవించియే తీరవలయును

यह मेरा हुकम है, आप को मानना होगा। = ఇది నాయొక్క ఆజ్ఞ, తమరు ఒప్పుకొనవలయును

उन्हें नकद जमानत दाखिल करना होगा। = వారు రొక్క పుజామీను ఇవ్వంచవలయును

इस हालाहल से भरे हुए दिल को निकालना ही होगा। = ఈ విష ముతో నిండిన హృదయమును తీసియే తీరవలయును

इस वक्त आपको हमारी खातिर करनी होगी। = ఈ సమయమున తమరు నా కొఱకు కొంత కష్టము తీసికొనవలయును

मेरी खातिर तुम्हें यह विचार छोड़ना पड़ेगा। నా కొఱకు నీవు ఈ అభిప్రాయమును విడువవలయును

यह युवराज को भी मानना ही पड़ेगा। = దీనిని యువరాజుకూడ ఒప్పుకొనియే తీరవలయును.

उसको अपने पति के लिये त्याग करना पड़ेगा। = ఆమె తన భర్త కొరకు త్యాగము చేయవలయును

अब तो आप को इन्हें छोड़ना ही पड़ेगा। = ఇప్పుడు తమరు వీరిని విడిచియే తీరవలయును

आप को हमारी खातिर से इतनी तकलीफ करनी पड़ेगी। = తమరు నా కొఱకు ఇంత కష్టము తీసికొనవలయును

[illegible] ఉదాహరణములలో చలనా, भोगना, मानना [illegible] లతో होना, पड़ना వచ్చినాయి కర్మణి [illegible] को [illegible] ప్రయోగము చేయుచుండుటను గమ[illegible]

"వలయును" అను అర్థమునందు जाय, जाए కూడ ఉపయోగింపబడును. ఇవి భవిష్యత్ కాలమును చూపును. వీటిని ఉపయోగించునపుడు కర్తతో को చేర్చరాదు మరియు ఈ जाय, जाए ఎక్కువగా భూతకాలక్రియలతోనే వచ్చును

ऐसा विवाह कानून के विरुद्ध माना जाय। — ఈ విధమైన పెళ్ళి చట్టమునకు విరుద్ధముగా తలంచవలయును

यह गौरवपूर्ण काम किसे सौंपा जाय। = ఈ గౌరవపూర్ణ మగు పనిని ఎవరికి అప్పగించవలయును

तुम ही बताओ, अब क्या किया जाय। = ఇప్పుడు ఏమి చేయవలయు నో నీవే చెప్పుము.

तिलक सरीखों को एक बार झुकाया जाए। = తిలకువంటి వారిని ఒకసారి అవమానపరచవలయును

यह कानून अज्ञान जनता के ऊपर लादा न जाए। = ఈ చట్టమును అజ్ఞాన జనులపై మోపకూడదు.

वर क्रिय और कन्या क्रिय की प्रथा बंद की जाए। — వరుని, కన్యను అమ్మవాడుకను నిలుపవలయును

పైన చెప్పబడిన ఉదాహరణములయందు माना, सौंपा, किया, झुकाया, लादा, की మొదలైన భూతకాల క్రియలతో जाय, जाए వచ్చుటను గమనింపుము.

# भूतकालिक क्रिया और चाह का संबंध

**चाह** ప్రయోగమునందు "**चाह**" కు ప్ర[illegible] ఉపయోగించవలయును. కాని ఈ **चाह** ను క[illegible] లందు క్రియలతో ఉపయోగించుటకు బదులు భూతకాల క్రియలతో ఉపయోగించుటకలదు. కాని ఇట్లు ఉపయోగించుటచే అర్థమునందు ఎటువంటి తేడాయుండదు.

वे काशी पर भी आक्रमण **किया** चाहते हैं।
वे काशी पर भी आक्रमण **करना** चाहते हैं।
} వారు కాశీపై దండెత్తుటకు కోరుచున్నారు.

वहाँ कुछ ब्राह्मण बलि **किया** चाहते हैं।
वहाँ कुछ ब्राह्मण बलि **करना** चाहते हैं।
} అచ్చట కొందరు బ్రాహ్మణులు త్యాగము చేయ గోరుచున్నారు

तुम हमारे धर्म पर अत्याचार **किया** चाहते हो।
तुम हमारे धर्म पर अत्याचार **करना** चाहते हो।
} నీవు మా న్యాయమును పడగొట్ట కోరుచున్నావు

क्या तुम मेरा भी अपमान **किया** चाहती हो?
क्या तुम मेरा भी अपमान **करना** चाहती हो?
} నీవు నన్ను కూడ అవమానించ కోరుచున్నావా?

अभी महाराज **आया** ही चाहते हैं।
अभी महाराज **आना** ही चाहते हैं।
} ఇప్పుడే రాజు తప్పక రా గోరుచున్నాడు.

यह गृह विद्रोह की आग तू क्यों **जलाया** चाहती है।
यह गृह विद्रोह की आग तू क्यों **जलाना** चाहती है।
ఈ కుటుంబ విద్రోహాగ్ని నీ వెందుకు రగుల్ప గోరుచున్నావు.

क्या **कहा** चाहती हो रानी!
क्या **कहना** चाहती हो रानी!
} ఏమి చెప్పగోరుచున్నావు, రాణి.

जो राजा को **समझाया** चाहते हैं । }
जो राजा को **समझाना** चाहते हैं । } వారు రాజును ఓదార్చ కోరుచున్నారు,

పై ఉదాహరణములలో స్థూలాక్షరములలోనుండు किया, आया, जलाया మొదలగునవి భూతకాలక్రియలు' करना, आना, जलाना మొదలగునవి క్రియలు

వర్తమానకాలిక కృదంతము నిద్రించునది, వచ్చునది, వాడినది, వచ్చినది అను అర్థములలోకూడ ఉపయోగింపవచ్చును. ఈ అర్థములో ద్వితీయా విభక్తి ప్రత్యయమైన को యొక్క అర్థమున్నది కావున ఆ को వర్తమానకాలిక కృదంతముతో చేరి రాదు ఆ వర్తమానకాలిక కృదంతమునకు సంబంధముండు నామవాచకము లేక సర్వనామముతో ఆ को ఉపయోగింప వలయును. ఆ నామవాచకము లేక సర్వనామము ఏకవచనముగాను, స్త్రీలింగముగాను ఉండినను ఈ వర్తమానకాలిక కృదంతము బహువచనముగానే వచ్చును

పోవుటకు, చెప్పుటకు అను అర్థములకుకూడ ఈ వర్తమానకాలికకృదంతము ఉపయోగింపవచ్చును. ఇందుకూడ కర్త ఎట్లుండినను ఈ కృదంతము బహువచనముగానే వచ్చును.

इतने दिनों में आज ही मै ने **उसे** यों **सोते** देखा है ।= ఇన్ని దినములకుగాను ఈ దినముదా నేను అతడు ఇట్లు నిద్రించినది చూచితిని.

अब किसी **फिटन को आते** देखकर उसका रक्त खौलने लगता था ।= అప్పుడు ఏదో ఒకబండివచ్చునది చూసి నెత్తురు పొంగినది.

**उसे रोते** देखकर उसकी दोनों बेटियाँ भी रोने लगी । = ఆమె ఏడ్చునది చూసి ఆమె ఇద్దరు కూతురులును ఏడ్చిరి

पति को भूमि पर गिरते देख कर औरत दौडी आयी । = భర్త భూమిపై పడునది చూచి భార్య పరుగెత్తివచ్చెను

मुझे रात्रि के समय उन्हें गंगा की ओर जाते देखकर संदेह हुआ ।= నాకు రాత్రి సమయములో వారు గంగానది వైపు పోవునది చూచి సందేహము ఏర్పడెను.

मै ने उसे बडे बडे पंडितों की मंडली में गाते देखा । = నేను అతడు పెద్ద పెద్ద పండితులయొక్క సభలో పాడినది చూచితిని

किसानों ने उसे अफसर के घर से निकलते हुए देखा। = రైతులు వాడు ఉద్యోగస్తుని ఇంటినుండి వచ్చినది చూచిరి.

मै ने इन्ही आँखों से उन्हें एक स्त्री से हँसते देखा था । = నేను ఈ కండ్లతోనే వారు ఒక స్త్రీతో నవ్వినది చూచితిని.

मै ने उसे कई बार गंगास्नान करते देखा है । = నేను అతడు పలుసారులు గంగాస్నానముచేయుట చూచియున్నాను.

वहाँ मै ने स्त्रियों को अपने संबध में कानाफूसी करते देखा । = అచ్చట నేను స్త్రీలు నన్నుగురించి గుసగుసలాడునది చూచితిని.

वह अपने ही घर में जाते डरती है । = ఆమె తన ఇంటికే పోవుటకు భయపడుచున్నది

लड़का फाटक पर आकर भीतर जाते हुए डरता है । = బాలుడు గడపవద్దకువచ్చి లోపలికి పోవుటకు భయపడుచున్నాడు.

तुम्हें नाच का नाम लेते लाज नही आती ? నీకు నాట్యము పేరు చెప్పుటకు సిగ్గుగా లేదా ?

मुझे तुमसे कहते हुए डर मालूम होता था । = నాకు నీతో చెప్పుటకు భయముగానుండెను

वह उस्ताद के सामने जाते हुए लजाता था । = అతడు ఉపాధ్యాయుల ఎదుట పోవుటకు సిగ్గుపడుచున్నాడు.

పైఁ జెప్పిన పది ఉదాహరణములలో రెండవదిగా స్థూలాక్షరములోనుండునది వర్తమానకాలిక కృదంతము. మొదట స్థూలాక్షరములోనుండునది రెండవ స్థూలాక్షరములోనుండు దానికి సంబంధమైన నామవాచకము సర్వనామముతో ద్వితీయా విభక్తియైన को ప్రత్యయము చేరి యుండుటను గమనింపుము

ఒక వాక్యమునందు రెండు భూతకాలక్రియలు వచ్చిన, రెండవభూతకాల క్రియ కొన్ని దినములను, నెలలను లేక సంవత్సరములను గుర్తించిన కర్తతో को విభక్తి ప్రత్యయము చేర్చవలయును కాని అట్టి వాక్యములందు మొదటి సామాన్య భూతకాలక్రియ ఎప్పుడును పుంలింగ బహువచనముగనుండును.

उनको यहाँ से गये चार पाँच दिन होगये। = వారు ఇచ్చటనుండి పోయి నాలుగైదు దినములయ్యెను

बापूजी को बीमार हुए लगभग एक मास हो गया था। గాంధీగారు వ్యాధిగ్రస్తులై ఇంచుమించు ఒక నెల అయ్యెను.

इस घटना को हुए बहुत दिन हो गये। = ఈ సంభవముజరిగి చాల దినములయ్యెను

उनको जेलखाने से छूट कर आये एक सप्ताह बीत गया था। = వారు చెరసాలనుండివచ్చి ఒక వారమయ్యెను.

उसको ससुराल आये डेढ मास के लगभग हो गये। = ఆమె అత్తగారింటికివచ్చి ఇంచుమించు ఒకటిన్నర నెల యయ్యెను.

## कर्ता और क्रिया का संबन्ध

క్రియకును కర్తకును సంబంధముండునపుడు కర్తతో का ప్రత్యయము చేర్చవలయును. ఈ క్రియతో విభక్తి ప్రత్యయము వచ్చిన కర్తతోనుండు का, के గా మారును.

భూతకాలిక కృదంతమునకును కర్తకును సంబంధముండినను కర్తతో का ప్రత్యయము చేర్చవలయును. ఈ భూతకాలిక కృదంతము బహువచనముగానుండిన, కర్తతోనుండు का, के గా మారును.

భూతకాలిక కృదంతములోనుండు నామవాచకముతో విభక్తి ప్రత్యయమువచ్చినను కర్తతో के ప్రత్యయము వచ్చును.

భూతకాలిక కృదంతము స్త్రీలింగ ఏకవచనముగాను, బహువచనముగాను నుండిన కర్తతో की ప్రత్యయము వచ్చును.

माता पिता का **कहना** मानो। = తల్లిదండ్రులు చెప్పునది వినుము.
आप का **कहना** भी ठीक है। = తమరు చెప్పునదియు సరియే.
तुम्हारा वहाँ जाना खतरे का काम है। = నీవు అచ్చట పోవుట అపాయకరమైన పని.
मंदिरों में गैर हिन्दु का **जाना** मना है। = దేవాలయములలోనికి హైందవేతరులు పోవుటకు ఆటంకమున్నది.
उनका **देना** न **देना** उनकी इच्छा है। = ఇచ్చుట లేక ఇవ్వకుండుట వారి యిష్టము.
मेरा यहाँ बैठना ठीक नही है। = నేను ఇచ్చట కూర్చుండుట సరికాదు.

अब तेरा यहाँ **रहना** ही उचित है। = ఇప్పుడు నీ విచ్చట ఉండుటయే ఉచితము

हमारा **चिल्लाना** पिताजी को अच्छा न लगा। = మేము అరచుట తండ్రిగారికి యిష్టములేదు

పైన జెప్పిన ఉదాహరణములలో స్థూలాక్షరములలో నుండు పదములు క్రియలుగానుండుటను, కర్తతో का విభక్తి ప్రత్యయము చేర్చియుండుటను గమనింపుము.

राम के **कहने से** वह दौड़ आया। = రాముడు చెప్పినందున అతడు పరుగెత్తి వచ్చెను

उसके **जाने पर** यह लड़ाई हुई। = అతడు పోయిన పిదప ఈ యుద్ధము జరిగెను

इनके **चलने में** और भी देर है। = ఇతడు పోవుటకు ఇంకను సమయమున్నది

मेरे **बोलने का** एक मुख्य कारण है। = నేను మాటలాడుటకు ఒక ముఖ్యకారణ మున్నది

हकीम के **आने के** पहले ही औरत मर गयी। = వైద్యుడు రాక మునుపే భార్య చనిపోయెను

పైన జెప్పిన ఉదాహరణములలో స్థూలాక్షరములలో నుండు క్రియలందు से, पर, में, का, के మొదలైన విభక్తి ప్రత్యయములు చేరియుండుటను, కర్తతో के ప్రత్యయము ఉండుటను గమనింపుము.

## भूतकालिक कृदंत – भाग 1

वेणु का **खरीदा घोड़ा** अच्छा है। = వేణు కొనిన గుఱ్ఱము బాగుగ నున్నది.

रमणी का सिया कुरता सुन्दर है । = రమణి కుట్టిన చొక్కాయి అందముగ నున్నది.

मेरा भेजा रुपया पहुँच गया । = నేను పంపిన రూపాయి చేరి పోయినది

तुम्हारा दिया कपड़ा फट गया । = నీవు యిచ్చిన వస్త్రము చినిగిపోయినది

उसका लिया खिलौना टूट गया । = అతడు తీసిన బొమ్మ పగిలిపోయినది

उनका लगाया पेड़ अच्छी हालत में है । = వారు నాటిన చెట్టు మంచిస్థితిలో నున్నది

इसका लिखा लेख बहुत अच्छा था । = ఇతడు వ్రాసిన వ్యాసము చాల బాగుండెను

इनका बनाया घर मिट्टी में मिल गया । = ఇతడు కట్టిన యిల్లు మట్టిపాలయ్యెను

हमारा किया काम बेकार हुआ । = మేము చేసిన పని వ్యర్థమయ్యెను.

आप का पढ़ा पाठ गलत था । = తమరు చదివిన పాఠము తప్పుగానుండెను

## भाग 2

वेणु के खरीदे घोड़े अच्छे हैं । = వేణుకొనిన గుఱ్ఱములు బాగున్నవి

रमणी के सिये कुरते सुन्दर हैं । = రమణి కుట్టిన చొక్కాయిలు అందముగానున్నవి.

मेरे भेजे रूपये पहुँच गये । = నేను పంపిన రూపాయిలు చేరి పోయెను

तुम्हारे दिये कपडे फट गये। = నీవు ఇచ్చిన వస్త్రములు చినిగి పోయెను

उसके लिये खिलौने टूट गये। = అతడు తీసిన బొమ్మలు పగిలి పోయెను.

उनके लगाये पेड अच्छी हालत में हैं। = వారు నాటిన చెట్లు మంచి స్థితిలో నున్నవి

इसके लिखे लेख बहुत अच्छे थे। = ఇతడు వ్రాసిన వ్యాసములు చాల బాగుండెను

इनके बनाये घर मिट्टी में मिल गये। = ఇతడు కట్టిన ఇండ్లు మట్టిపాలయ్యెను.

हमारे किये काम बेकार हुए। = మేము చేసినపనులు వ్యర్థమయ్యెను.

आप के पढ़े पाठ गलत थे। = తమరు చదివిన పాఠములు తప్పుగా నుండెను.

इनके बताये हुए मार्ग पर चलना ही उचित है। = వీరు చెప్పిన త్రోవలో పోవుటయే మంచిది.

इसके दिखाये हुए रास्ते पर जाना अनुचित है। = ఇతడు చూపిన మార్గమునందు పోవుట మంచిది కాదు.

भाग 3

गोपू की कही बात बिलकुल ठीक है। = గోపు చెప్పిన విషయము అక్షరాల నిజము.

रुक्मणी की कही बातें बिलकुल ठीक हैं। = రుక్మిణి చెప్పిన విషయములు అక్షరాల నిజము.

मेरी खरीदी किताब अच्छी है। = నేను కొనిన పుస్తకములు బాగుగావున్నది

तुम्हारी खरीदी किताबें अच्छी नहीं हैं। = నీవు కొనిన పుస్తకములు మంచివి కావు.

उसकी लायी चीज़ बहुत बुरी है। = అతడు తెచ్చిన వస్తువు చాల చెడ్డది.

उनकी लायी चीजें बहुत बुरी हैं। = వారు తెచ్చిన వస్తువులు చాల చెడ్డవి.

इसकी रखी कुरसी गिर गयी। = ఇతడుంచిన కుర్చీ పడిపోయెను.

इनकी रखी कुरसियाँ गिर गयीं। = వీరుంచిన కుర్చీలు పడిపోయినవి.

हमारी खायी रोटी मीठी थी। = మేము తినిన రొట్టె తియ్యగానుండెను.

आप की खायी रोटियाँ कैसी थी? = తమరు తినిన రొట్టెలు ఎట్లుండెను?

## भाग 4

कल्याणी का गाया हुआ गाना अच्छा था। = కల్యాణి పాడిన పాట బాగుండెను.

सुकुमार का पाला हुआ कुत्ता गायब हुआ। = సుకుమారునిచే పెంచబడిన కుక్క దారిపోయెను.

मेरा बुलाया हुआ बालक अभी न आया। = నేను పిలిచిన బాలుడింకను రాలేదు.

तुम्हारा सजाया हुआ यह घर कितना सुन्दर है! = నీవు అలంకరించిన ఈ యిల్లు ఎంత అందముగనున్నది!

उसके सुनाये हुए समाचार एक भी सच नहीं हैं। = వాడు చెప్పిన సమాచారములు ఒకటిన్ని నిజముకావు.

उनके काटे हुए पेड़ बड़े अच्छे पेड़ हैं। = వారు నరికిన చెట్లు చాల మంచివి.

इसके धोये हुए कपड़े जरा भी साफ नहीं हैं। = పీడు ఉతికిన బట్టలు కొంతకూడ శుభ్రముగా లేవు.

इसके खोदे हुए तालाब बहुत सुन्दर हैं। = వీరు త్రవ్విన కోనేర్లు చాల అందముగానున్నవి

हमारी बनायी हुई माला बिक गयी। = మేము కట్టిన మాల అమ్మబడెను.

आप की बनायी हुई मालायें भी बिक गयीं। = తమరు కట్టిన మాలలు కూడ అమ్మబడినవి

పైన జెప్పబడిన మొదటి భాగమునందు స్థూలాక్షరములోయుండు భూతకాలిక కృదంతము ఏకవచనముగా నుండుటవలన కర్తతో का ప్రత్యయము చేరి యుండుటను దానికి ఏ అర్థము లేకుండుటను గమనింపుము.

రెండవ భాగమునందు చెప్పబడిన ఉదాహరణములందు స్థూలాక్షరములలోయుండు భూతకాలిక కృదంతము బహువచనముగా నుండుటవలన కర్తతో के ప్రత్యయము వచ్చుటను దానికి ఏ అర్థము లేకుండుటను గమనింపుము.

మూడవ భాగమునందు చెప్పబడిన ఉదాహరణములందు స్థూలాక్షరములలోయుండు భూతకాలిక కృదంతము స్త్రీలింగ ఏకవచన, బహువచనముగా నుండుటవలన కర్తతో की ప్రత్యయము వచ్చుటను దానికి ఏ అర్థము లేకుండుటను గమనింపుము.

ఈ మూడు భాగములయందు భూతకాలిక కృదంతమైన हुआ, हुए, हुई లోపించి యుండుటను గమనింపుము.

నాల్గవ భాగమునందు భూతకాలిక కృదంతమైన हुआ हुआ, हुई లోపింపక యుండుటను గమనింపుము

ఈ భూతకాలిక కృదంతములో వచ్చు అకారాంత నామ వాచకమును గురించి ఒక విషయము జ్ఞప్తిలో ఉంచుకొనవల యును. అకారాంత నామవాచకము స్త్రీలింగముగా నుండిన దానికి బహువచనము వచ్చును.

అకారాంతమైన किताब, गाय, तसवीर ఇవి స్త్రీలింగములు వీటికి బహువచనమునకు यें చేర్చవలయును किताब + यें = किताबें, गाय + यें = गायें, तसवीर + ये = तसवीरे ।

అకారాంత నామవాచకము పుంలింగముగా నుండిన దాని బహువచనము రాదు. బహువచనమునకు కూడ ఏక వచనమేవచ్చును.

అకారాంతమైన फूल, घर, तालाब ఇవి పుంలింగములు. బహువచనమునకు కూడ ఇదియేయని ఎట్లు తెలిసికొనవల యును? దానికి ఏకవచన కృదంతమైన हुआ, हुए గా ఉప యోగించిన ఇదియే బహువచనమగును

## उदाहरण

खिला हुआ फूल = వికసించిన పుష్పము
खिले हुए फूल = వికసించిన పుష్పములు
बनाया हुआ घर = కట్టిన ఇల్లు
बनाये हुए घर = కట్టిన ఇండ్లు
खोदा हुआ तालाब = త్రవ్విన కోనేరు.
खोदे हुए तालाब = త్రవ్విన కోనేరులు.

పుంలింగమైన फूल, घर, तालाब మొదలైన అకారాంత నామవాచకములతో ఏదైన విభక్తి ప్రత్యయమువచ్చిన, ఇవి బహువచనమగును బహువచనమగునప్పుడు వీటితో ओं వచ్చును.

| | |
|---|---|
| फूल+को=फूलों को | घर+को=घरों को |
| फूल+से=फूलों से | घर+से=घरों से |
| फूल+केलिये=फूलों के लिये | घर+के लिये=घरों के लिये |
| फूल+का=फूलों का | घर+का=घरों का |
| फूल+पर=फूलों पर | घर+पर=घरों पर |
| फूल+में=फूलों में | घर+में=घरों में |

तालाब + को = तालाबों को
तालाब + से = तालाबों से
तालाब + के लिये = तालाबों के लिये
तालाब + का = तालाबों का
तालाब + पर = तालाबों पर
तालाब + में = तालाबों में

मै ने खिले हुए फूलों को देखा। = నేను వికసించిన పుష్పములు చూచితిని.

तुमने बनाये हुए घरों को मिटा दिया। = నీవు కట్టిన ఇండ్లను నాశనము చేసితివి.

उसने खोदे हुए तालाबों को भर दिया। = అతడు త్రవ్విన కోనేరులు నింపెను.

ఏకవచనమైన పుంలింగ అకారాంత నామవాచకము విభక్తి ప్రత్యయము లేకుండగనే బహువచనమగుటకు ఒక ఉపాయ

మున్నది. అనగా క్రియ బహువచనముగా ఉపయోగించిన ఆ ఏకవచనము బహువచనమగును.

कल से सबक प्रारंभ होता है। రేపునుండి పాఠము ప్రారంభ మగుచున్నది

कल से सबक प्रारंभ होते हैं। = రేపునుండి పాఠములు ప్రారంభమగుచున్నవి.

मै ने अच्छा घर बनाया। = నేను మంచి ఇల్లు కట్టితిని

मै ने अच्छे घर बनाये। = నేను మంచి ఇండ్లు కట్టితిని.

उसने तालाब खोदा। = అతడు కోనేరు త్రవ్వెను.

उसने तालाब खोदे। = అతడు కోనేరులు త్రవ్వెను.

हमने सुगन्ध फूल तोड़ा। = మేము వాసనగల పుష్పము కోసితిమి.

हमने सुगन्ध फूल तोडे। =మేము వాసనగల పుష్పములు కోసితిమి.

పై ఉదాహరణములలో స్థూలాక్షరములో నుండునది అకారాంత నామవాచకము ఒక్కొక్క మొదటి వాక్యమునందు క్రియ ఏకవచనముగా ఉండుటవలన ఆ నామవాచకము ఏక వచనముగా వచ్చుటను, రెండవ వాక్యమునందు క్రియ బహు వచనముగానుండుటవలన అ నామవాచకము బహువచనముగా వచ్చుటను గమనింపుము.

పుంలింగమైన అకారాంతనామవాచకముతో ఏదైన విభక్తి ప్రత్యయము వచ్చినను, భూతకాలిక కృదంతము బహువచన ముగానే వచ్చును.

खिले हुए फूल का सुगंध अच्छा है। = వికసించిన పుష్పము యొక్క వాసన బాగున్నది.

बनाये हुए घर की दीवार गिर गयी। = కట్టిన ఇంటియొక్క గోడ పడిపోయెను

खोदे हुए तालाब में पानी नही है। =త్రవ్విన కోనేటిలో నీరులేదు

పైన జెప్పిన ఉదాహరణములలో స్థూలాక్షరములలో నుండు నామవాచకములను, వాని ప్రక్కన వచ్చియుండు విశేష్య ప్రత్యయములను, వానివలన కృదంతములనందు కలిగి యుండు మార్పును గమనింపుము

తాత్కాలిక వర్తమాన కాలము తాత్కాలిక అపూర్ణ భూతకాలము మరియు कर యొక్క అర్థములోకూడ ఈ భూత కాలిక కృదంతమువచ్చును. कर అనుటకు ఇచ్చట " కొని " అను అర్థము. कर అను అర్థములో వచ్చునపుడు ఈ భూత కాలికకృదంతము ఎప్పుడున్ను బహువచనముగానే యుండును.

अभी आप मुझे बाजारी औरत ही समझे हुए हैं।
अभी आप मुझे बाजारी औरत ही समझ रहे हैं।
ఇంకను తమరు నన్ను వేశ్యగా తలంచుచున్నారు

कोकिला इस समय उसके प्रेमजाल में फँसी हुई थी।
कोकिला इस समय उसके प्रेमजाल में फँस रही थी।
కోకిల ఈ సమయములో వాని ప్రేమపాశములో చిక్కుకొను చుండెను

एक हिन्दू जाति की स्त्री कुएँ में गिरी हुई है।
एक हिन्दू जाति की स्त्री कुएँ में गिर रही है।
ఒక హిందూజాతి స్త్రీ చెడు త్రోవలో పోతూవున్నది.

वहाँ तेरा कौन बैठा हुआ है? } అచ్చట నీకు ఎవరు కూర్చొని
वहाँ तेरा कौन बैठ रहा है? } వున్నారు

పైఁ జెప్పిన ఉదాహరణములలో స్థూలాక్షరములలో నుండునది తాత్కాలిక వర్తమానకాలము మరియు తాత్కాలిక అపూర్ణభూతకాలము

वह दरवाजे पर बैठे हुए मेरी राह देखने लगे।
वह दरवाजे पर बैठ कर मेरी राह देखने लगे।
అతడు గడపమీద కూర్చొని నాకొరకై నిరీక్షించెను

वेणु ने शरम से सिर झुकाये हुए कहा, कुछ नहीं।
वेणु ने शरम से सिर झुका कर कहा, कुछ नहीं।
వేణు సిగ్గుచే తలవంచి ఏమియు లేదని చెప్పెను

सेठजी आरामकुरसी पर लेटे हुए हुक्का पी रहे थे।
सेठजी आरामकुरसीपर लेट कर हुक्का पी रहे थे।
సేటుగారు వాలు కుర్చీమీద పడుకొని హుక్కా త్రాగుచుండెను,

शीशे के सामान ठेलों पर लदे चले आते थे।
शीशे के सामान ठेलों पर लद कर चले आते थे।
సీసాయిసామానులు చేతిబండిలో ఉంచుకొని వచ్చుచుండెను

वह सिर झुकाये अपने पति की बातें सुन रहीथी।
वह सिर झुकाकर अपने पति की बातें सुन रही थी।
ఆమె తలవంచి తన భర్త మాటలను వినుచుండెను

ఆకారాంత పుంలింగ నామవాచకముతో విభక్తి ప్రత్యయము వచ్చిన ఆ ఆకారాంత నామవాచకము ఏకారాంతమగును. బహువచనమునకు ओं వచ్చును.

घोड़ा + को = घोड़े को | तोता + को = तोते को
घोड़ा + ओं + को = घोड़ों को | तोता + ओं + को = तोताओं को

उसने घोड़े को देखा । = అతడు గుఱ్ఱమును చూచెను
उसने घोड़ों को देखा । = అతడు గుఱ్ఱములను చూచెను.

इसने तोते को देखा । = వీడు చిలుకను చూచెను.
इसने तोतों को देखा । = వీడు చిలుకలను చూచెను.

నామవాచకముతో విభక్తి ప్రత్యయము వచ్చినపుడు ఆ నామవాచకమునకు వెనుక वह, यह, वे, ये మొదలైన సర్వనామములువచ్చిన उस, इस, उन, इन గా మారును.

यह घोड़ा सफेद है । = ఈ గుఱ్ఱము తెల్లగా ఉన్నది.
ये घोड़े तेज चलते हैं । = ఈ గుఱ్ఱములు వేగముగా నడచుచున్నవి.

वह घोड़ा काला है । = ఆ గుఱ్ఱము నల్లగా ఉన్నది.
वे घोड़े धीरे धीरे चलते हैं । = ఆ గుఱ్ఱములు మెల్లగా నడచుచున్నవి.

इस घोड़े की पूँछ सुन्दर है । = ఈ గుఱ్ఱముతోక అందముగాఉన్నది
इन घोड़ों के पास बच्चे भी जा सकते हैं । = ఈ గుఱ్ఱములవద్దకు బిడ్డలు కూడ పోవచ్చును

उस घोड़े की पूँछ टेढी है । = ఆ గుఱ్ఱముతోక వంకరగానున్నది.
उन घोड़ों के पास जाना डर लगता है । = ఆ గుఱ్ఱముల వద్దకు పోవుటకు భయముగా ఉన్నది.

वह तोता बड़ा है । = ఆ చిలుక పెద్దది
वे तोते बड़े हैं । = ఆ చిలుకలు పెద్దవి.

यह तोता छोटा है। = ఈ చిలుక చిన్నది,
ये तोते छोटे है। = ఈ చిలుకలు చిన్నవి.

उस तोते का दाम चार रुपये हैं। = ఆ చిలుక వెల నాలుగు రూపాయలు

उन तोतों का भाव ज्यादा हैं। = ఆ చిలుకల వెల అధికము
इस तोते का दाम छे रुपये हैं। = ఈ చిలుక వెల ఆఱు రూపాయలు,
इन तोतों का भाव कम है। = ఈ చిలుకల వెల తక్కువ.

పై స్థూలాక్షరములోనుండు की, के, का విభక్తి ప్రత్యయము వచ్చుటవలన घोडा, तोता మొదలైన నామవాచకము మారివచ్చుటను वह, यह, वे, ये మొదలగు సర్వనామము उस, इस, उन, इन గా మారివచ్చుటను గమనింపుము.

ఏదైన ఒక పుంలింగ నామవాచకమునకు ప్రక్కను ఏదైన విభక్తి ప్రత్యయమువచ్చిన ఆ నామవాచకమునకు వెనుకనుండు का, के గా మారును

सुलोचना का घर दूर है। = సులోచన ఇల్లు దూరముగా ఉన్నది,
सुलोचना के घर मे मेरी बहन है। = సులోచన ఇంటిలో నా సహోదరి ఉన్నది

ఈ వాక్యమునందు घर అను నామవాచకమునకు ప్రక్క में విభక్తిప్రత్యయము వచ్చుట వలన घर కు వెనుక వచ్చు का, के గా వచ్చుటను గమనింపుము.

దీర్ఘమైన ఏకవచన స్త్రీలింగ నామవాచకము బహు వచనముగా మారుటకు ऑ చేర్చవలయును, అపుడు ఆ దీర్ఘ

మైన ఏకవచన స్త్రీలింగ నామవాచకము అ దీర్ఘ ముగను. (అనగా ई, इ గా ) మారును.

## उदाहरण

| एकवचन | बहुवचन |
|---|---|
| लडकी | लडकी + याँ = लडकियाँ |
| नारी | नारी + याँ = नारियाँ |
| नदी | नदी + याँ = नदियाँ |
| मुरगी | मुरगी + याँ = मुरगियाँ |

ఆకారాంత స్త్రీలింగ నామ వాచకము బహువచనముగా మార్చుటకు ये చేర్చవలయును విభక్తి ప్రత్యయము వచ్చిన ओं చేర్చవలయును.

माला + यें = मालायें
अबला + यें = अबलायें
वेश्या + यें = वेश्यायें
माला + ओं + को = मालाओं को
अबला + ओं + का = अबलाओं का
वेश्या + ओं + में = वेश्याओं में

## कर, का दूसरा प्रयोग

कर అను ధాతువును రెండు వాక్యములను ఒకటిగ చేర్చుటకు కూడ ఉపయోగించుటకలదు. ఉదా ;— उसने

खाया = అతడు తినెను, वह स्कूल गया = అతడు పాఠశాలకు పోయెను. ఈ రెండు వాక్యములను ఒకటిగ చేర్చుటకు कर ఉపయోగించవలయును. ఎట్లన वह खाकर स्कूल गया। = అతడు తిని పాఠశాలకుపోయెను. ఇచ్చట कर ఉపయోగించి రెండు వాక్యములను ఒకటిగ చేర్చి యుండుటను గమనింపుము ( గమనిక — ఈ कर ధాతువులతోనే చేర్చవలయును )

मै नहा कर आता हूँ। = నేను స్నానముచేసి వచ్చుచున్నాను
तुम जल्दी सोकर उठो। = నీవు శీఘ్రముగ నిద్రించి లెమ్ము.
वह आकर चला गया। =అతడు వచ్చి వెళ్ళిపోయెను.
यह घर जाकर आयेगा। = ఇతడు ఇంటికిపోయి వచ్చును
वे खा पीकर लेट गये। = వారు తిని పడుకొనిరి
ये जरा देर पढ कर दम लेंगे। = వీరు కొంతసేపు చదివి విశ్రాంతి తీసుకొనెదరు.

आप अपना काम करके आइये। = తమరు తమ పనిని చేసి రండి

हम नदी में तैर कर आये। = మేము నదిలో ఈది వచ్చితిమి

वह माता को प्रणाम कर घर से चल पडा। = అతడు తల్లికి నమస్కరించి ఇంటినుండి వెళ్ళిపోయెను.

बालक की बातें सुन कर नारद जी मन ही मन खुश हुए। = బాలుని మాటలను విని నారదుడు మనస్సునందే సంతోషించిరి

वहाँ यमुना में स्नान करके भगवान का स्मरण कर। = అచ్చట యమునలో స్నానముచేసి భగవంతుని పూజింపుము

बहुत से देशों में घूम कर आयी हूँ। = అనేక దేశములను చుట్టి వచ్చియున్నాను

कुछ आराम करके कल जाओ। = కొంత విశ్రాంతి తీసుకొని రేపటికి వెళ్ళుము.

सब ने मिल कर वेद विधि से दोनों का विवाह करा दिया। = అందరున్ను చేరి వేదముల ప్రకారము ఇద్దరి వివాహమును చేయించిరి.

दमयती हाथ में जयमाल लेकर आयी। = దమయంతి చేతిలో జయమాల తీసికొనివచ్చెను.

नल दमयती को वन में छोड़ कर चल दिये थे। = నలుడు దమయంతిని అడవియందు వదలి వెళ్ళిపోయెను.

वे रथ से उतर कर नदी की ओर बढे। = వారు రథమునుండి దిగి నదివైపు పోయిరి

वे अपने रथ पर चढ कर फिर हस्तिनापुर आये। = వారు తమ రథమును ఎక్కి మరల హస్తినాపురమునకు వచ్చిరి.

दुष्यत ने मछुए को इनाम देकर वापस भेज दिया। = దుష్యంతుడు బెస్తవానికి బహుమతి యిచ్చి పంపివేసెను.

घर जाकर उसे चीरा तो उस में यह अगूठी निकली। = ఇంటికి వెళ్ళి దానిని కోసినపుడు దానిలో ఈ ఉంగరము దొరికెను.

मै अपनी माता से उपदेश लेकर आया हूँ। = నేను నా తల్లి ఉపదేశము పొంది వచ్చియున్నాను

నామవాచకము లేక సర్వనామము నసించునపుడు లేక వృద్ధిఅగునపుడు లేక క్రొత్తగా ఒకటి ఉత్పత్తి అగునప్పుడు కర్తతో **का, के, की** విభక్తి ప్రత్యయములు చేర్చవలయును. అట్లు చేర్చినచో ఈ ప్రత్యయములకు ఏ అర్థమునుండదు.

मुहम्मद के ज़माने में **बुतपरस्ती** का सदा के लिये अंत हो गया = ముహమ్మదు నబి కాలములో విగ్రహారాధన శాశ్వతముగా నశించిపోయెను. ఈ వాక్యమునందు స్థూలాక్షరములలో

నుండు నామవాచకము व्रतपरस्ती (విగ్రహారాదన), ముహ మ్మదు నబి కాలమునకు ముందు జనులు చాల శ్రద్ధగా చేయు చుండిరి నబి కాలములో ఇది నశించిపోయెను దాని వలన నామవాచకమైన व्रतपरस्ती తో का ప్రత్యయము చేరియుండు టను దానికి ఏ అర్థము లేకుండుటను గమనింపుము.

लेकिन अब तो उस देश के कई टुकडे हो गये हैं। = కాని ఇప్పుడు ఆ దేశము పలు ముక్కలయ్యెను. ఈ వాక్యమునందు రేఖాంకితము చేయబడిన నామవాచకమైన देश (దేశము) క్షీణ దశను వచ్చియుండుటవలన ఆ నామవాచకమైన देश తో के చేరియుండుటను దానికి ఏ అర్థము లేకుండుటను గమనింపుము.

अशोक के जमाने में बौद्ध धर्म का खूब प्रचार हुआ। = అశోకుని కాలమునందు బౌద్ధమతము బాగుగా ప్రచారము లోనికి వచ్చెను ఈ వాక్యమునందు స్థూలాక్షరములలోనుండు बौद्ध धर्म అశోకుని కాలములో చాల వృద్ధి పొందినది దాని వలన నామవాచకమైన बौद्ध धर्म తో का చేరియుండుటను, దానికి ఏ అర్థము లేకుండుటను గమనింపుము

श्री रामचन्द्र ने रावण को मार कर सीता जी का उद्धार किया। శ్రీరామచంద్రుడు రావణుని చంపి సీతను కాపాడెను. ఈ వాక్యమునందు రేఖాంకితము చేయబడిన सीता जी (సీత) రావ ణుని వద్ద బంధింపబడి యుండినది, ఆమెను రామచంద్రుడు కాపాడిన దానివలన నామవాచకమైన सीता जी తో का ప్రత్య యము చేరియుండుటను, దానికి ఏ అర్థము లేకుండుటను గమనింపుము.

पिता के देहान्त के बाद **उसका जन्म** हुआ। = తండ్రి చనిపోయిన పిదప అతడు పుట్టెను. ఈ వాక్యమునందు స్థూలాక్షరములలోనున్న उसका जन्म (అతడు పుట్టెను.) అనునది ఒక ఉత్పత్తిని చూపుచున్నది. దానివలన సర్వనామమైన यह తో का ప్రత్యయము (यह+का=उसका) వచ్చుటను గమనింపుము.

विषयी मुसलमान बादशाहों के समय में **इसका जन्म** हुआ। భోగవిలాసులైన మహమ్మదీయ చక్రవర్తుల కాలమున ఇది ఏర్పడెను ఈ వాక్యమునందు స్థూలాక్షరములలోనున్న इसका जन्म అనునది ఒక ఉత్పత్తిని చూపుచున్నది. దానివలన సర్వనామమైన यह తో का ప్రత్యయము (यह+का=इसका) వచ్చుటను గమనింపుము.

---

## और भी कुछ उदाहरण

कम से कम दुखों का अंत हो जायगा। = కనీసము దుఃఖములు తొలగిపోవును

उधर घर पहुँचने से पहले ही बाबुल में अलक्सांदर का देहांत हो गया। = అచ్చట ఇంటికిపోయి చేరక మునుపే బాబుల్ దేశమునందు అలెగ్జాండరు చనిపోయెను

नदियों के उपजाऊ काँठों में सब से पहले सभ्यता का विकास हुआ। = నదుల సారవంతమైన గట్టులలోనే మొట్టమొదట నాగరికత వృద్ధిపొందెను.

राज्य पुनर्गठन के कारण नये राज्यों का उदय हुआ। = రాజ్యముల విభజనము చేసినందువలన క్రొత్తరాజ్యములు ఏర్పడెను.

भारतवर्ष में मनुष्य जाति का जन्म नही हुआ। = భారత దేశమునందు మనుష్యజాతి పుట్టలేదు

प्रथम महायुद्ध की कठिनाइयों के कारण यहीं पर कारखानों का निर्माण हुआ। = మొదటియుద్ధమునందు కలిగిన కష్టముల మూలమున ఇచ్చట పరిశ్రమశాలలు నిర్మింపబడెను.

## वर्तमानकालिक क्रिया की पुनरुक्ति

1. వర్తమానకాలిక క్రియ రెండుమారులువచ్చిన దానిని వర్తమానకాలిక క్రియాపునరుక్తి అని చెప్పెదరు. ఇటువంటి వాక్యములలో గమనింపవలసిన ముఖ్యవిషయ మొకటి ఉన్నది. అది ఏమన ఇట్టి వాక్యములలో వర్తమానకాలిక క్రియా పునరుక్తియొక్క ఫలితము ఇతరులపై పడునపుడు కర్తతో के విభక్తిప్రత్యయమును మాత్రము చేర్చవలయును.

2. దాని ఫలితము కర్తపైననే పడునపుడు ఈ के విభక్తి ప్రత్యయము చేర్చకూడదు.

ఈ వర్తమాన కాలిక క్రియా పునరుక్తి ఎల్లప్పుడును పుంలింగ బహువచనముగా నుండును.

### उदाहरण

1. नेहरूजी के आते आते सभा में शांति फैली। = నెహ్రూజీ రాగానే సభలో శాంతి కలిగినది. ఈ వాక్యమునందు రేఖాంకి

తము చేయబడియుండు आते आते అను క్రియా పునరుక్తిచే సభలో శాంతి కలిగినది. దానివలన ఈ క్రియా పునరుక్తితో వచ్చుచున్న नेहरूजी అను కర్తతో के ప్రత్యయము వచ్చుటను దానికి ఏ అర్థమును లేకుండుటను గమనింపుము

उनके जाते जाते सभा में गड़बड़ी हुई। = వారు పోయి నంతనే సభలో గలభా బయలుదేరెను. ఈ వాక్యమునందు రేఖాంకితము చేయబడి ఉండు जाते जाते అను క్రియా పునరుక్తిచే సభలో గలభా పుట్టెను. దానివలన ఈ పునరుక్తితో వచ్చుచున్న वे (वे+के=उनके) అను కర్తతో के ప్రత్యయము వచ్చుటను దానికి ఏ అర్థమును లేకుండుటను గమనింపుము.

पानी के बहते बहते यह दीवार गिर पड़ी। = నీరు పారి పారి ఈ గోడ పడిపోయెను. ఈ వాక్యమునందు రేఖాంకితము చేయబడియుండు बहते बहते అను క్రియా పునరుక్తిచే గోడ పడిపోయెను దానివలన ఈ పునరుక్తితో వచ్చుచున్న पानी అను కర్తతో के ప్రత్యయము వచ్చుటను దానికి ఏ అర్థమును లేకుండుటను గమనింపుము.

पानी के बरसते बरसते गली भर दलदल हो जाती है। = వాన కురిసి కురిసి వీధియంతయు బురద అగుచున్నది. ఈ వాక్యమునందు స్థూలాక్షరములలోనుండు बरसते बरसते అను క్రియా పునరుక్తిచే వీధియంతయు బురద అగుచున్నది దానివలన క్రియాపునరుక్తితో వచ్చుచున్న पानी అను కర్తతో

के ప్రత్యయము వచ్చుటను, దానికి ఏ అర్థమును లేకుండుటను గమనింపుము

राधा के **लिखते लिखते** कागज फट गया। = రాధ వ్రాస్తూ వ్రాస్తూ ఉండగానే కాగితము చినిగి పోయెను. ఈ వాక్యమునందు స్థూలాక్షరములలోనుండు **लिखते लिखते** అను క్రియా పునరుక్తిచే కాగితము చినిగిపోయెను దానివలన క్రియా పునరుక్తితో వచ్చుచున్న राधा అను కర్తతో के ప్రత్యయము వచ్చుటను దానికి ఏ అర్థమును లేకుండుటను గమనింపుము

इसके **पढते पढते** दीपक बुझ गया। = ఇతడు చదువుతూ వుండగానే దీపము ఆరిపోయినది ఈ వాక్యమునందు స్థూలాక్షరములలోనుండు **पढते पढते** అను క్రియా పునరుక్తిచే దీపము ఆరిపోయెను దానివలన క్రియా పునరుక్తితో వచ్చుచున్న यह (यह+के=इसके) అను కర్తతో के ప్రత్యయము వచ్చుటను దానికి ఏ అర్థమును లేకుండుటను గమనింపుము.

2. वह पढते पढते सो गया। = అతడు చదువుచూ చదువుచూ నిద్రపోయెను.

यह बोलते बोलते अंदर गयी। = ఈమె మాటలాడుచూ మాటలాడుచూ లోపలికి పోయెను.

वे सुनते सुनते खामोश रहे। = వారు వింటూ వింటూ మౌనముగా ఉండిరి.

मोहन ने गाते गाते यह काम किया। = మోహనుడు పాడుచూ పాడుచూ ఈ పని చేసెను.

घोड़ा दौड़ते दौड़ते गिर पड़ा । = గుఱ్ఱము పరుగిడునపుడు పడిపోయెను.

रमणी बोलते बोलते रुक गयी । = రమణి మాటలాడునపుడు ఆగిపోయెను

हम खाते खाते उठ खड़े हुए । = మేము భోజనముచేయుచునే లేచితిమి

यह कहते कहते उसका गला भर आया । = ఇది చెప్పుచుండగనే అతనికి ఏడ్పు వచ్చెను

यह काम करते करते अभी खतम न हुआ । = ఈ పని చేయను చేయను పూర్తి కాలేదు.

सन्ध्या होते होते दोनों भाई मदुरा पहुँचे । = ప్రొద్దుకూకుచుండగా ఇద్దరు సహోదరులు మధుర చేరిరి.

पैर चलते चलते दुखने लगता है । = నడచి నడచి కాళ్లు నొప్పి యెత్త నారంభించుచున్నవి

आप इंतजार करते करते धोखा खा गये । = తమరు యెదురు చూచి చూచి మోసపోతిరి.

यह हँसते हँसते थक गया । =ఇతడు నవ్వి నవ్వి అలసిపోయెను.

वह सोते सोते आलसी बन गया । =అతడు నిద్రించి నిద్రించి సోమరి అయ్యెను

बच्चा दौडते दोडते खेलता है । = బిడ్డ పరుగెత్తి పరుగెత్తి ఆటలాడుచున్నాడు

खाते खाते बलराम पेट्ट बन गया । = తిని తిని బలరాముడు తిండిపోతు ఆయెను.

పైన జెప్పిన రెండవభాగమునందు కర్తతో “ने” ప్రత్యయము లేకుండుటను గమనింపుము.

# विना का प्रयोग

बिना అనుటకు " లేకుండ " అని అర్థము. ఇది నామ వాచకము లేక సర్వనామముతో వచ్చిన దానితో के ప్రత్యయము వచ్చును ఈప్రత్యయమునకు ఏఅర్థమును లేదు. ఈ बिना నామవాచకమునకు లేక సర్వనామమునకు వెనుక, లేక ముందు వచ్చును.

భూతకాలిక క్రియతో बिना వచ్చిన ఆ క్రియ ఎప్పుడును పుంలింగ బహువచనముగానే ఉండును. ఇచ్చట के ప్రత్యయము రాదు.

| | |
|---|---|
| नमक के बिना कौन खा सकता है ?<br>बिना नमक के कौन खा सकता है ? | ఉప్పు లేకుండ ఎవరు భుజించ గలరు? |
| उसके बिना यह काम पूरा नही होता।<br>बिना उसके यह काम पूरा नही होता। | అతడు లేక ఈ పని పూర్తి కాదు |
| कुछ बूढे लोग लाठी के बिना चलते हैं।<br>कुछ बूढे लोग बिना लाठी के चलते हैं। | కొందరుముసలివాండ్రు చేతికఱ్ఱలేక నడచుచున్నారు. |
| औरत के बिना घर की शोभा नही होती।<br>बिना औरत के घर की शोभा नही होती। | స్త్రీలు లేనిచో ఇల్లు శోభించదు. |

పైం జెప్పిన ఉదాహరణములలో नमक, लाठी, औरत మొదలైన నామవాచకముతో మఱియు वह (वह+के=उसके) అని సర్వనామముతో बिना వచ్చుటను, के ప్రత్యయము ఉండుటను, ఆ ప్రత్యయమునకు ఏ అర్థమును లేకుండుటను, ఈనామ

వాచకమునకు సర్వనామమునకు వెనుక, ముందు बिना ఉండు టను గమనింపుము.

कल मै बिना खाये लेट गया। } నేను నిన్న భుజించకయే పడు
कल मै खाये बिना लेट गया। } కొంటిని.

अमीर ने भिखारी को अन्न बिना दिये निकाल दिया।
अमीर ने भिखारी को अन्न दिये बिना निकाल दिया।
ధనవంతుడు బిచ్చగానికి అన్నము పెట్టక గెంటివేసెను.

यह मुझे बिना बुलाये चला गया। } ఇతడు నన్ను పిలువక వెళ్ళి
यह मुझे बुलाये बिना चला गया। } పోయెను

आप कैसे बिना खाये पिये रहते हैं? } తమరు ఎట్లు భుజించక
आप कैसे खाये पिये बिना रहते हैं? } యున్నారు?

పైన జెప్పిన ఉదాహరణములలో खाये, दिये, बुलाये, खाये पिये మొదలైన భూతకాలిక క్రియలు బహువచనముగా ఉండుటను వీటికి ముందు వెనుక बिना వచ్చుటను క్రియలతో के ప్రత్యయము లేకుండుటను గమనింపుము.

---

## सिवा, अलावा का प्रयोग

सिवा అనుటకు 'తప్ప' అని అర్థము. ఇది ఒకటిని మాత్రము చూపుటకు వచ్చును. నామవాచకముతో, సర్వ నామముతో వచ్చునపుడు వాటితోకూడ के ప్రత్యయము తప్పక వచ్చును. ఈ ప్రత్యయము ద్వితీయా విభక్తి ప్రత్యయము యొక్క అర్థము (ను, ని) ఇచ్చును.

अलावा అనుటకు 'గాక' అని అర్థము. ఇది ఒకటితో మరొకటిని గుర్తించుటకు వచ్చును, నామవాచకముతో, సర్వ నామముతో వచ్చునపుడు के ప్రత్యయము తప్పక వచ్చును. ఈ ప్రత్యయము ద్వితీయావిభక్తి ప్రత్యయముయొక్క అర్థము ( ను, ని ) ఇచ్చును.

सिवा, अलावा ఇవి నామవాచకమునకు, సర్వనామము నకు ముందు, వెనుక ఉపయోగింపబడును

मोहन के सिवा उसका सहायक कोई नही है। = మోహ నుడుతప్ప అతనికి సహాయముచేయువాడు ఎవడును లేదు. ఈ వాక్యమునందు అతనికి సహాయము చేయువాడు మోహను డొక్కడే, ఇతరులు లేరు. దానివలన ఒకనిని మాత్రము చూపు టను सिवा వచ్చును मोहन అను నామవాచకముతో के ప్రత్య యము వచ్చుటను, అది ద్వితీయా విభక్తి ప్రత్యయముయొక్క అర్థము (ని, ను) ఇచ్చుటను గమనింపుము.

इस घर के सिवा मेरे पास दूसरा कोई नही है। = ఈ ఇల్లు తప్ప నా వద్ద మరియేమియు లేదు. ఈ వాక్యమునందు నావద్ద నుండు సంపద ఇల్లు ఒకటే వేరేమియు లేదు. దాని వలన ఒకే ఒక సంపద అయిన ఇల్లును మాత్రము చూపుటకు सिवा వచ్చు టను घर అను నామవాచకముతో के ప్రత్యయము వచ్చుటను అది "ని" అను అర్థము ఇచ్చుటను గమనింపుము.

## और भी कुछ उदाहरण

मेरे सिवा और दूसरा यहाँ नहीं आये। } నేనుతప్ప మరెవ్వరు
सिवा मेरे और दूसरा यहाँ नहीं आये। } ఇచ్చట రాలేదు.

इसके सिवा दयालु आदमी यहाँ कोई नही है।
सिवा इसके दयालु आदमी यहाँ कोई नही है।
ఇతని తప్ప దయగలిగిన మనుష్యుడు ఇచ్చట ఎవ్వరును లేరు

एक कुरसी के सिवा दूसरी कोई टूटी कुरसी भी नही है।
सिवा एक कुरसी के दूसरी कोई टूटी कुरसी भी नही है।
ఒక కుర్చీ తప్ప మరి ఏ విరిగిన కుర్చీకూడ లేదు

इस रुपये के सिवा सरोजा के पास एक कौडी भी नहीं है।
सिवा इस रुपये के सरोजा के पास एक कौडी भी नही है।
ఈ రూపాయి తప్ప సరోజ వద్ద ఒక దమ్మిడికూడ లేదు.

## अलावा का उदाहरण

अलावा सुलोचना के और भी कई लड़कियाँ खेलती हैं।
सुलोचना के अलावा और भी कई लड़कियाँ खेलती हैं।
సులోచన కాక ఇంకను అనేక బాలికలు ఆటలాడుచున్నారు.

अलावा वर्षा के हवा भी चलती है।
वर्षा के अलावा हवा भी चलती है।
వర్షము కాక గాలికూడ వీచుచున్నది.

गोमती के अलावा मेरे और दो स्त्रियाँ हैं।
अलावा गोमती के मेरे और दो स्त्रियाँ है।
గోమతి కాక నాకు ఇంకను ఇద్దఱు భార్యలున్నారు.

चावल के अलावा गन्ना भी हमारे देश में पैदा होता है।
अलावा चावल के गन्ना भी हमारे देश में पैदा होता है।
బియ్యముకాకుండ చెఱకుకూడ మనదేశములో ఉత్పత్తిఅగుచున్నది.

इसके अलावा ये उनके दोस्त भी हैं।
अलावा इसके ये उनके दोस्त भी हैं।
ఇది కాక వీరు వారికి స్నేహితులు కూడ

# विशेषण

ఒక నామవాచకముయొక్క గుణమును తెలుపునది విశేషణము. ఇవి రెండు విధములుగనున్నవి ఒకటి ఆకారాంత విశేషణము, మరియొకటి అకారాంత విశేషణము. ఆకారాంత విశేషణము నామవాచకము ననుసరించిమారును. అకారాంత విశేషణము మారదు

अच्छा लड़का । = మంచి బాలుడు.
अच्छे लड़के । = మంచి బాలురు.
अच्छी लड़की । = మంచి బాలిక.
अच्छी लड़कियाँ । = మంచి బాలికలు.

सुन्दर लड़का । = అందమైన బాలుడు.
सुन्दर लड़के । = అందమైన బాలురు
सुन्दर लड़की । = అందమైన బాలిక
सुन्दर लड़कियाँ । = అందమైన బాలికలు.

పై ఉదాహరణములలో अच्छा, सुन्दर ఇవి విశేషణములు ఇవి నామవాచకములయొక్క గుణమును తెలుపుటను గమనింపుము.

(1) నామవాచకము, విశేషణము రెండును అకారాంతముగనుండిన నామవాచకములో బహువచనమురాదు

(2) నామవాచకము అకారాంతముగ నుండి విశేషణము ఆకారాంతముగనుండిన విశేషణము మాత్రము బహువచనముగా వచ్చును.

## उदाहरण

(1) होशियार बालक । = తెలివిగల బాలుడు.
होशियार बालिका । = తెలివిగల బాలిక.
होशियार बालिकायें । = తెలివిగల బాలికలు

(2) गोरा बालक । = ఎఱ్ఱని బాలుడు.
गोरे बालक । = ఎఱ్ఱని బాలురు.
गोरी बालिका । = ఎఱ్ఱని బాలిక.
गोरी बालिकायें । = ఎఱ్ఱని బాలికలు.

పై ఉదాహరణములలో మొదటి భాగమునందు బహువచనము లేకుండుటను, రెండవ భాగమునందు गोरे అను విశేషణము బహువచనముగ నుండుటను గమనింపుము.

పుంలింగ అకారాంత నామవాచకముతో విభక్తి ప్రత్యయమువచ్చిన సాధారణముగ బహువచనము వచ్చును. దీనిని గురించి ముందు వారములో (118 పేజీలో) చెప్పబడియున్నది.

## वाला, का प्रयोग

वाला, वाले, वाली ఇవి మూడు కాలములను గుర్తించును. ఇవి सोचना, करना, बिकना మొదలగు క్రియలతో వచ్చునపుడు ना, ने గా మారును.

## उदाहरण

सोचना + वाला = सोचनेवाला ।
करना + वाले = करनेवाले ।
बिकना + वाली = बिकनेवाली ।

## वर्तमान काल

मनुष्य एक सोचनेवाला प्राणी है। = మనుష్యుడు యోచన చేయునటువంటి ఒక ప్రాణి

घी दूध पसंद न करनेवाले भी मजे से खाते हैं। = నెయ్యి, పాలు యిష్టపడనివారుకూడ ప్రియముతో తినుచున్నారు.

अकसर दूकानों में बिकनेवाली मिठाइयाँ गन्दी रहती हैं। = తరచుగా అంగళ్లలో అమ్ముబడు మిఠాయీలు అశుద్ధముగనున్నవి.

## भविष्यत काल

उनका हर एक चित्र एक मानसिक परिस्थिति को बताने वाला होता है। వారియొక్క ఒక్కొక్క రేఖయును ఒక మానసిక పరిస్థితిని తెలుపు నటువంటిదిగా నున్నది

उपदेश देनेवाले का आसन सुननेवालों से ऊँचा होना चाहिये। = ఉపదేశము ఇచ్చువాని ఆసనము వినువారికంటె ఎత్తుగ నుండ వలయును.

उस समय तानाजी के बेटे की शादी होनेवाली थी। = ఆ సమయము నందు తానాజియొక్క కుమారునికి వివాహము జరుగనుండెను

## भूतकाल

अपने खर्च के लिये एक पैसा भी न लेनेवाला बादशाह नासिरुद्दीन था। తన ఖర్చుకు ఒక కానికూడ తీసికొనని చక్రవర్తి నాసరుద్దీను ఒకడే

इस राज्य की नींव डालनेवाले हरिहर और बुक्का नाम के दो भाई थे। ఈ రాజ్యమునకు పునాది వేసినవారు హరిహర, బుక్క అను పేరుగల ఇద్దరు సహోదరులే

सघमित्रा मगध देश की रहनेवाली थी। = సంఘమిత్ర మగధదేశ నివాసి

ఈ वाला నామవాచకముతో వచ్చునప్పుడు ఆ నామ వాచకముయొక్క సొంతమును, బంధుత్వమును గుర్తించును

## उदाहरण

बहुत मित्रवाला आदमी सुख से रहता है। = అనేక మిత్రులుగల మనుష్యుడు సుఖముగ నివసించుచున్నాడు.

इसलिये यूनानवाले उसे बहुत प्यार करते थे। = దాని వలన యూనానిప్రజలు అతనిని చాల ప్రేమించుచుండిరి

यह दूकानवाली औरत कुरूपी है, पर वह मिठबोली है। =ఈ అంగడి స్త్రీ వికారముగ నున్నది కాని ఆమె ఇంపుగా మాటలాడుచున్నది

## जब – तब, का प्रयोग

जब, तब అనునది హిందీ యందొక విశేష ప్రయోగము ఇవి రెండు వాక్యములను ఒకటిగా చేర్చుచున్నవి.

ఉదాహరణము – "అతడు వచ్చినప్పుడు నే నింటి యందు లేదు" అను వాక్యమును హిందీయందు రెండు వాక్యములుగా విభజించుచున్నారు ఎట్లన जब वह आया, तब मैं घर पर न था। = అతడెప్పుడు వచ్చెనో అప్పుడు నే నింటియందు లేకుంటిని. ఇటువంటి సమయములందు వీనిని ఉపయోగించవలెను. ఈ तब కు బదులుగా तो కూడ ఉపయోగించుట కలదు. ఈ రెంటిలో ఒకదానిని లోపించికూడ ఉపయోగించవచ్చును. కాని అర్థమునందు ఏ మార్పును రాదు.

जब उसने उसे पहले पहल देखा तब वह सौन्दर्य की कोमल कली थी। అతడు ఆమెను మొట్టమొదట చూచినప్పుడు సౌందర్యపు మృదువైన మొగ్గగానుండెను

जब इतने भले मानुस बैठे हुए थे तब मुझे क्यों सकोच होने लगा। = ఇంతపెద్ద మనుష్యులు కూర్చొని యుండినపుడు నే నెందుకు సిగ్గు పడవలయును

जब तुम्हे पसद है तब मुझे भी पसद ही है। = నీకు ఇష్టమయినచో నాకు కూడ ఇష్టమే

जब दस बज गये तब उसने खाना परसा। = పది గంటలయినప్పుడు ఆమె భోజనము వడ్డించెను

जब उधार मागने पर उसे रुपये न मिले तो वह अधीर हो गया। = అప్పు అడిగి రూపాయలు దొరకనప్పుడు అతడు అధైర్య పడెను

सुभद्रा जब सोकर उठी तो यह कौतुक देख कर दग रह गयी। = సుభద్ర నిద్రనుండి లేచినపుడు ఈమె సంతోషమును గాంచి ఆశ్చర్యపడెను.

एक दिन जब वे आठ बजे घर लौटे तो घर का दरवाजा बंद पाया। = ఒక దినము వారు ఎనిమిది గంటలకు ఇంటికి తిరిగి వచ్చినపుడు తలుపు మూయబడి యుండుటను గాంచిరి

अच्छी बात है, जब बुलाऊँ तो चले आना। = మంచిదే, పిలిచినపుడు వచ్చివేయుము.

घर लौटे तो सीधे माता के पास जाकर बोले। = ఇంటికి తిరిగి వచ్చినపుడు నేరుగా తల్లివద్దకుపోయి చెప్పిరి

उसने वेतन पाया तो सब का सब स्त्री के हाथो मे रख दिया। = అతడు జీతము తీసినపుడు అంతయును భార్యకు ఇచ్చివేసెను.

प्रातः काल घर गया तो अपनी चाची के हाथ मे कगन देखा। = ఉదయము ఇంటికి పోయినపుడు తన పెద్దమ్మ చేతిలోని కంకణము చూచెను

उन्होंने उनका पत्र पढा तो एक थप्पड सा मुँह पर लगा। = వారు వారి ఉత్తరమును చదివినపుడు చెంపపై ఒక దెబ్బ వేసినవిధముగా నుండెను

तुम पहले जब दुबली थी, अच्छी लगती थी। = నీవు మొదట సన్నగా నుండినప్పుడు బాగుగా ఉంటివి

जब कोई भागेगा, देखा जायगा। = ఎవరయినను పరుగెత్తిన చూచెదము.

वह जब गंगा नहाने जाती, सखी को साथ ले लेती। = ఆమె గంగలో స్నానము చేయుటకు పోవునపుడు చెలికత్తెను తీసికొని పోవుచున్నది

थोडी देर बाद मैं जब उठा, उन्हें वहाँ न देखा। = కొద్దిసేపయిన పిదప నేను మేల్కొనినపుడు వారిని అచ్చట చూడలేదు.

పై వాక్యములందు जब, तब అను జంటపదముల ఉపయోగమును మీరు చదివితిరి. ఇట్టి ఉదాహరణ వాక్యములలో రెండువాక్యము లుండుటను గుర్తించితిరి కాని ఈ जब, तब లను తీసివేసి ఆ రెండు వాక్యములను ఒకటిగ చేర్చికూడ ప్రయోగించ వచ్చును అట్లు చేర్చునపుడు కర్తతో के విభక్తి ప్రత్యయము మరియు వాక్యము మధ్యలో వచ్చు క్రియ ఎల్లప్పుడు వర్తమానకాల పుంలింగ బహువచనముగ నుండును. ఉదా — जब गांधीजी आये, तब सभा में शांति फैली। అను వాక్యమును जब, तब లను తీసివేసి ఒకవాక్యముగ చేయవలెనన్న गांधीजी के आते ही सभा में शांति फैली। అనవచ్చును.

## और भी कुछ उदाहरण

जब स्कंदगुप्त रहता है तब स्त्रियों को अस्त्र चलाना न पडेगा।
स्कंदगुप्त के रहते स्त्रियों को अस्त्र चलाना न पडेगा।
స్కందగుప్తుడు ఉండువరకు స్త్రీలు ఆయుధములు ధరించరాదు

जब रणजीतसिंह सभा में आयेंगे तब उनका वध कर दिया जायगा।
रणजीतसिंह के सभा में आते ही उनका वध कर दिया जायगा।

రణజీత్‌సింగ్ సభకు వచ్చినంతనే అతడు చంపబడును

जब रणजीतसिंह लाहौर का राजा हुआ तब अन्य सिक्ख सरदार उनसे जलने लगे।

रणजीतसिंह के लाहौर का राजा होते ही अन्य सिक्ख सरदार उनसे जलने लगे।

రంజీత్‌సింగ్ లాహోరునకు చక్రవర్తి అయినంతనే ఇతర సిక్కు సర్దారులు అతనిపై అసూయపడిరి

जब राम ने अयोध्या छोडा तो राजा दशरथ की मृत्यु हो जाती है।
राम के अयोध्या छोड़ते ही राजा दशरथ की मृत्यु हो जाती है।

రాముడు అయోధ్యను వదలినంతనే దశరథుడు చనిపోవుచున్నాడు.

जब वे आये तो रानी के सब सैनिक वहाँ से भाग गये।
उनके आते ही रानी के सब सैनिक वहाँ से भाग गये।

వారు వచ్చినంతనే రాణియొక్క సైన్యమంతయు అచ్చటనుండి పారిపోయెను

## अगर – तो, यदि – तो, जो – तो का प्रयोग

तమరు వచ్చినచో నేనుకూడ వచ్చుటకు తయారుగా ఉన్నాను, నీవు పెండ్లి చేసికొనినచో పినతల్లి చాల సంతోషపడును ఈ రెండు వాక్యమునందు రేఖాంకితము చేయబడియుండు క్రియలో 'చో' అను ధ్వని వచ్చుచున్న దానికి

[illegible] 'तो' అను అవ్యయము ఉపయోగించ వలయును ఈ విధముగ ఉపయోగించునపుడు కర్తకు ముందు లేక వెనుక अगर, यदि, जो ఈ మూటిలో ఏదైన ఒకటి ఉపయోగించవలయును వీటిని ఉపయోగించకుండను కూడ విడువవచ్చును ఐతే 'तो' మాత్రము క్రియకు తప్పక ఉపయోగించవలయును

अगर आप चलें तो मैं भी चलने को राजी हूँ। = తమరు వచ్చినచో నేనుకూడ వచ్చుటకు తయారుగా ఉన్నాను

तुम अगर शादी करोगे तो चाची बहुत खुश होगी। = నీవు పెళ్ళి చేసికొనినచో పినతల్లి చాల సంతోషపడును

इससे अगर कुछ अपराध हो तो क्षमा करना। ఇతనిది ఏదైన తప్పు ఉండినచో క్షమించవలయును

अगर तुम पराये घर में रहोगी तो लोग निंदा करेंगे। = నీవు అన్యుల ఇంటిలో ఉండినచో జనులు నిందించెదరు

अगर लड़का रूठ गया है तो माँ को भी रूठे रहना चाहिये ? = బాలుడు కోపించుకొనినచో తల్లికూడ కోపించుకొనవలయును.

यदि बाघ मिला तो तुम्हें ही पहला फायर करना होगा। = పులి దొరికినచో నీవే మొదట కాల్పవలయును

यदि लड़की पसंद न होगी तो छोड़ दो। = కన్య ఇష్టము గానిచో వదలివేయుము.

यदि राजा ने दिया तो मैं लेने को तैयार हूँ। = రాజు ఇచ్చినచో నేను తీసికొనుటకు తయారుగా ఉన్నాను,

मोहन यदि कन्या को देखेगा तो पसंद करेगा। = మోహనుడు కన్యను చూచినచో ప్రియపడును

तुम यदि काफी के साथ रोटी भी लो तो कुछ बुरा न होगा। = నీవు కాఫీతోకూడ రొట్టె తీసికొనినచో యేమియు చెడుపుండదు.

जो मै पुण्य का काम करूँ तो मुझे स्वर्ग में स्थान मिलेगा। = నేను పుణ్య కార్యము చేసినచో నాకు స్వర్గములో స్థానము దొరకును.

जो आप आज्ञा दें तो जाऊँ और उसकी बेटी ब्याह लाऊँ। = తమరు ఆజ్ఞ ఇచ్చినచో అతని కుమార్తెను పెళ్ళిచేసికొనెదను.

मेरी सखी जो मेरे पास होगी तो सलाह देगी। = నా చెలికత్తె నావద్ద ఉండినచో సలహానిచ్చును

तेरा मालिक जो इतना बल रखता है तो मेरे सामने आवे।=నీ యజమానుడు యింత బలశాలిగా ఉండినచో నా యెదుటికి రానిమ్ము

वहाँ से जो भागा तो स्टेशन पर आकर दम लिया। = అచ్చటనుండి పరుగెత్తివచ్చినచో స్టేషనుకువచ్చి విశ్రాంతి తీసికొనెను.

పైన జెప్పిన ఉదాహరణములలో స్థూలాక్షరములలో నుండు క్రియతో '**तो**' వచ్చుటను కర్తకు ముందు, వెనుక **अगर, यदि, जो** వచ్చుటను గమనింపుము.

**अगर, यदि, जो** ఇవి మూడున్ను కాక '**तो**' మాత్రము వచ్చు ఉదాహరణములు క్రింద ఇవ్వబడివుండుటను గమనింపుము.

जीजी चली जाएँगी तो मै भी न रहूँगी। = అక్క పోయినచో నేను కూడ ఉండను

तुम नही जानती तो कौन जानती है? = నీకు తెలియక పోయినచో ఇంకెవరికి తెలియును?

आप की ऐसी ही इच्छा है तो मैं बैठती हूँ। = తమకు యిష్టమిట్లుండినట్లయిన నేను కూర్చుండెదను

तुम जाओगी तो काम कैसे चलेगा ? = నీవు పోయినచో పని యెట్లు జరుగును?

कहीं गिर पड़ोगी तो मुश्किल होगी । = ఎచ్చటనయిన పడిపోయినచో కష్టము కలుగును

పైన చెప్పిన तो అవ్యయము ఏ, ఓ, దా, ఐతే అను అర్థములలో కూడ వచ్చును

(1) रामू, कोई चीज भूल तो नहीं गये ! = రామూ, యే వస్తువును మరువలేదే !

पहले तो इसके वरक उलटते रहे । = ప్రారంభములోనే దీని పేజీలు త్రిప్పుతూ ఉంటివి

अच्छा, देखूँ तो कौन खड़ा रहता है ? = మంచిది, చూచెదము ఎవడు నిలబడి ఉండునో?

बन्दी भाग तो गया नहीं ? = ఖైదీ పరుగెత్తి పోలేదా ?

(2) मुझे तो उसपर यकीन है । = నాకో అతనిపై నమ్మకము ఉన్నది

अरे, यह तो कोई स्त्री है । = అరే, ఈ మెయో ఒక స్త్రీ

अब तो तुम हिन्दी गीत गाती हो । = ఇప్పుడో నీవు హిందీ పాట పాడుచున్నావు

रमणी तो तेरी बहन है । = రమణియో నీ సహోదరి.

(3) तेरा गाना सुनकर तो मै खुश होता हूँ । = నీ పాట వినిదా నేను సంతోషపడుచున్నాను.

मै भी तो देश सेवा करना चाहता था । = నేను కూడదా దేశసేవ చేయ తలచితిని.

उसका जाना तो ठीक है । = అతడు పోవుటదా మంచిది.
तुम ने तो यह बात कही । = నీవుదా ఈ విషయము చెప్పితివి

(1) तो चलूँ, यहाँ ठहरना ठीक नही है । = అట్లయితే పోదును, ఇచ్చట ఉండుట మంచిది కాదు,
तो दुखी पर दया करके इसे दे आइये । = ఐతే బీదవానిపై దయపెట్టి దీనిని ఇచ్చిరండి.
तो क्या अभी तक तुम्हे मेरा विश्वास नही ? = ఐతే ఇంత వరకు నాపై నీకు నమ్మకము లేదా?
तो तुम अपने अपराध को कबूल करते हो । = ఐతే నీవు నీ తప్పుని ఒప్పుకొంటావు

---

## ही, का प्रयोग

ही అవ్యయము ఏ, దా, తప్పక అను మూడు అర్థములలో వచ్చును

आप ही एक कहानी सुनाइये । = తమరే ఒక కథను చెప్పండి
वह हाथ से पैसा छूता ही नही । = అతడు చేతిలో డబ్బునంటుటయే లేదు.
मै गेंद खेलता ही नहीं । = నేను బంతి ఆడుటయే లేదు
अब तो तू ही झूठा है । = ఇప్పుడైతే నీవుదా అసత్యవాదివి.
वे ही हमारे दल के मुखिया हैं । = వారుదా మా కక్షికి అధ్యక్షులు.
भाग्य में ऐसा ही बदा था । = అదృష్టమునందు ఇట్లుదా వ్రాసి ఉండెను.

सरोजा ही अब मेरी बैरिन हो गयी। = సరోజదా ఇప్పుడు నా విరోధిగా అయిపోయెను

तो क्या मेरा पति अब चले ही जाएँगे ? = ఐతే నా భర్త ఇపుడు తప్పక పోవునా ?

मेरी बात सुनो, वरना तुम मार ही खाओगे। = నా మాట వినుము లేకపోతే నీవు తప్పక దెబ్బ తినెదవు

अब मीरा का नाचना गाना रोकना ही होगा। = ఇప్పుడు మీరా ఆడుట పాడుట తప్పక నిలుపవలయును

हमारे ऊपर संदेह होगा ही नहीं। = మనపై సందేహము ఏర్పడనే ఏర్పడదు

---

## कि, का प्रयोग

कि అనునది రెండు వాక్యములను ఒకటితో నొకటి జత పరచుటకు ఉపయోగింపబడుచున్నది,

मै नही जानता कि वह कब आएगा ? = అతడెప్పుడు వచ్చునది నాకు తెలియదు

मै ने वसंता से पूछा कि क्या तुम मुझ से शादी करोगी ? = నీవు నన్ను పెళ్ళి చేసికొనెదవా అని నేను వసంతను అడిగితిని

उसने कहा कि अब मेरे पास पैसा नहीं है। = ఇపుడు నావద్ద డబ్బు లేదని అతడు చెప్పెను

मुझे यकीन है कि वह तुमको ज़रूर रुपया दे देगा। = అతడు నీకు తప్పక రూపాయి యిచ్చివేయునని నాకు నమ్మకమున్నది.

देखो, मेरी कलम मेज पर है कि नहीं ? = చూడుము, నా కలము మేజాపై ఉన్నదా లేదా ?

तुमने खाना खाया कि नही ? = నీవు భోజనము చేసితివా లేదా?

उस्ताद दरजे में हैं कि नही। = ఉపాధ్యాయులు తరగతిలో ఉన్నారా లేదా ?

बताओ, वे आज आते है कि नही। = చెప్పుము వారు, ఈ రోజు వచ్చెదరా లేదా

वह जहाज की तरफ जा रहा था कि रास्ते में वह लडकी मिली। = అతడు ఓడ ప్రక్కకు పోవుచున్నప్పుడు త్రోవలో ఆ బాలికదొరికినది

मै ऐसा सोच रहा था कि बाघ एक दम तड़पा। = నేను ఇట్లు యోచించుచున్నప్పుడు పులి అకస్మాత్తుగా దుమ్కెను

हम सबक पढ ही रहे थे कि मालुम हुआ, आज तालाब का मेला है। మేము పాఠము చదువుచున్నప్పుడు ఈ దినము తెప్ప తిరునాళ్లయని తెలిసినది

हाथी चलने ही वाला था कि राजकुमार उत्तम बोला। = ఏనుగు ప్రయాణమగునప్పుడు రాజకుమార్ ఉత్తముడు చెప్పెను.

दो बार ही कुल्हाडी चलायी कि उसके सिर में दर्द होने लगा। = రెండుదపాలు గొడ్డలితో కొట్టినప్పుడు అతని తలనొప్పియెత్తినది.

मै ने देखा कि बेचारी कमला रो रही थी। =పాపం, కమల యేడ్చుచుండుటను నేను చూచితిని.

मुझे बडी खुशी हुई कि आप अच्छे मौके पर आये। తమరు మంచి సమయమునకు వచ్చినందువలన నాకు చాల సంతోషము కలిగినది.

लोगों ने देखा कि उसका पुत्र नाव में आ रहा है। = అతని కుమారుడు నావలో వచ్చుచుండుటను జనులు చూచిరి

मुझे क्या मालुम कि क्या होनेवाला है। = ఏమి జరుగునో నాకేమి తెలియును?

अब इसमें कोई शक नहीं है कि तुम बेईमान हो। నీవు మోసగాడవనుటకు ఇప్పుడేమియు సందేహము లేదు

तुम अफसोस न करना कि मुझ पर यह आफत आयी । = నాకు ఈ ఆపద వచ్చినందుకు నీవు చింతపడవద్దు

तुम जाँच करके बताओ कि यह तेल पुराना है या नहीं । = ఈనూనె పాతదా లేక క్రొత్తదా అనునది నీవు పరీక్షచేసి చెప్పుము

हम पुराणों में पढते हैं कि देवता लोग विमानों में उडते थे । = దేవతలు విమానములో ప్రయాణము చేయుచుండిరని మనము పురాణములో చదువుచున్నాము

పై చెప్పిన ఉదాహరణములలో రెండు వాక్యములను ఒకటితో మరొకటి జతపరచుటకు कि ఉపయోగించియుండుటను గమనింపుము. ఈ कि కి బదులుగా जो కూడ ఉపయోగించవచ్చును.

आप कौन हैं जो मुझे इस प्रकार कमजोर बनाते हैं ? = నన్నిట్లు బలహీన పరచుటకు మీరెవరు ?

ऐसा कौन सा पुण्य था जो मैं भगवान के दर्शन कर सकता । = నేను భగవంతుని దర్శనము చేయునటువంటి భాగ్యమెచ్చటనుండెను!

अच्छा हुआ जो मैं ने ब्याह न किया । = నేను పెండ్లి చేసుకొనక యుండుట మంచి దయ్యెను.

किस मुहूर्त में उसको लिया जो ऐसी घटना हुई । = ఇటువంటి దుర్ఘటన జరుగుటకు ఏ వేళలో దానిని తీసితినో

मै ऐसी कहाँ हूँ जो पुकार होते ही दौडी जाऊँ। = పిలిచినంతనే పరుగెత్తి వచ్చుస్థితిలో నే నెక్కడ ఉన్నాను!

मेरी क्या मजाल जो बोल भी जाऊँ । = మాటలాడుటకు నా కేమి ధైర్యము!

मै ने तुम्हें क्या कहा जो आते ही गरजने लगे । = వచ్చినదే గర్జించునట్లు నీ కేమి చెప్పితిని?

मै मूढ हूँ जो मैं ने एक घडी के लिये भी उसका विश्वास किया । = ఒక నిమిషము సేపు అతనిని నమ్మి నే నొక మూర్ఖుడనయితిని

## जो, का दूसरा प्रयोग

ఇచ్చట जो అనునది ఎవడు, ఎవతె, ఏది, ఏ, దేనిని, ఏమి, అది అను అర్థములో వచ్చును. ఇది సంబంధము చూపు సర్వనామము. ఏ వాక్యమునందు जो అను సర్వనామము వచ్చునో ఆ వాక్యమునందు वह అను సర్వనామము తప్పక వచ్చును. वह కు బదులుగా सो కూడ వచ్చును.

जो रोज यहाँ आता है वह गोपाल का दोस्त है। = రోజును ఇచ్చటికి వచ్చువాడు గోపాలుని మిత్రుడు.

जो मीठे स्वर में गाती है वह मेरी बहन है। = మధుర స్వరములో పాడునది నా సహోదరి.

जो होना था सो हो गया। = జరుగవలసినది జరిగిపోయెను.

जो आदमी तेरे घर आया वह मेरे घर भी आया। = నీ ఇంటికి వచ్చినవాడు నా ఇంటికికూడ వచ్చెను.

जो तुम ने देखा वही मैं ने भी देखा। = నీవు చూచినదే నేను కూడ చూచితిని.

जो मै देना चाहता था वह मेरे पास नहीं है। = నేను ఇవ్వ దలచినది నా వద్ద లేదు.

जो रुकावट है वह पेश आ सकती है। = రాబోవు ఆటంకము తప్పక వచ్చును.

పైన చెప్పిన ఉదాహరణములందు మొదట जो పిదప वह ఉపయోగించబడి ఉన్నది. అయితే మొదట वह పిదప जो

కూడ ఉపయోగించవచ్చును. అర్థములో ఏ మార్పు ఉండదు

वह गोपाल का दोस्त है जो रोज यहाँ आता है।
वह मेरी बहन हैं जो मीठे स्वर में गाती है।
वह मेरे घर भी आया जो आदमी तेरे घर आया।
वही मै ने भी देखा जो तुम ने देखा।
वह मेरे पास नही है जो मै देना चाहता था।
वह पेश आ सकती है जो रुकावट है।

## जो, का विस्तारपूर्ण उदाहरण

**जो** అను సర్వనామముతో విభక్తిప్రత్యయము చేరిన ఏకవచన బహువచనములకు ఉదాహరణములు.

जिसने यह काम किया, उसीने यह भी किया। = ఈ పనిని చేసిన వాడే దీనినికూడ చేసెను

जिसको तुम देखते हो, उसीको मै भी देखता हूँ। = నీవు చూచుచున్నవానినే నేనుకూడ చూచుచున్నాను

जिससे यह काम बिगड़ गया, उसको दंड दो। = ఈ పనిని చెడిపిన వానికి శిక్ష ఇయ్యవలయును

जिसको कम वेतन मिलता है, उसकी जिंदगी मुश्किल से कटती है।= తక్కువజీతమును పొందువాడు తన జీవితమును చాల కష్టముతో గడుపుచున్నాడు.

जिसके लिये तुम यह कपड़ा लाये, वह अब शहर में नही है।= ఎవరికిగాను ఈ గుడ్డను తెచ్చితివో అతడిపుడు పట్టణమునందు లేడు

जिसके वास्ते मैं ने इतना कष्ट उठाया, उसी ने मुझे गालियाँ दी।= ఎవనికొరకు నే నింత కష్టమును తీసికొంటినో అతడే నన్ను తిట్టెను

जिससे मै ने यह खरीदा, वह बड़ा धोखेबाजी है। = నే నెవనివద్ద నుండి దీనిని కొంటినో అతడు మోసగాడు

जिससे सरला अपने को बडी समझती है, वह सरला से बडी है। = ఎవతెకన్న సరళ తన్ను గొప్పదిగా తలచుచున్నదో ఆమె సరళ కన్న గొప్పది.

जिसका शरीर मोटा है, उसमें ताकत कम होती है। = లావుగా వుండు మనుష్యునియందు బలము తక్కువ.

जिसके घर में वह रहता है, उसका मालिक बड़ा बेईमान है। = వాడు నివసించుచున్న ఇంటి యజమానుడు విశ్వాసరహితుడు.

जिसकी टांग में घाव है, वह कैसे चल सकता है? = కాలియందు గాయమున్న మనిషి ఎట్లు నడువగలడు?

जिसपर यह लिखना चाहती है, उसी पर गोमती भी लिखना चाहती है। ఈమె వ్రాయఁగోరుదానిపై గోమతికూడ వ్రాయఁగోరుచున్నది

जिसमें मै ने हाथ रखा, उसमें एक बिच्छू था। = నేను చేయునుంచిన దానిలో ఒక తేలుండెను.

जिन्होंने यह मकान बनाया, वे आज संसार में नहीं हैं। = ఈ భవనము కట్టినవారు ఈ ప్రపంచమున లేరు.

जिनको तुम बिगाड़ना चाहते हो, वे अच्छे ही होंगे। = నీవు చెడుప గోరువారు బాగుగనే యున్నారు.

जिनसे यह काम पूरा हुआ, उन्हीं से वह काम भी पूरा होगा। = ఈ పని పూర్తి చేసినవారి చేతనే ఆ పనికూడ పూర్తియగును.

जिनको खाँसी आती है, वे रात में नही सोते। = దగ్గుచే బాధ పడువారు రాత్రులందు నిద్రపోరు

जिनके लिये मैं ने यह महल बनाया, वे हाल में इस दुनियाँ से चल बसे। = ఎవరికిగాను ఈ భవనము కట్టితినో వారీప్రపంచ మునుండి వెళ్ళిపోయిరి

जिनके वास्ते यह चहलपहल करते हैं, वे ज़रूर न आयेंगे। = ఎవరికి గాను పీరు ఈ కేకలు వేయుచున్నారో వారు రానే రారు.

जिनको यह रोग है, वे जरूर न बचते। = ఈ రోగమున్న వారు బ్రతుకనే బ్రతుకరు.

जिनसे आप ने यह साडी खरीदी, उन्ही से मै ने भी यह साडी खरीदी। = తమరు ఈ చీరను కొనినవారివద్దనుండియే నేనుకూడ ఈ చీరను కొంటిని

जिनसे तुम अपने को धनवान समझते हो, वे तुम से धनी हैं। = ఎవరికంటె నీవు తన్ను ధనవంతునిగా తలచుచున్నావో వారు నీకన్నను ధనవంతులు

जिनका दिमाग बिगड गया, उनको पागल कहते हैं। = మెదడు చెడిన వానిని పిచ్చివాడనెదరు

जिनके घर में वेणु रहता है, उसीमें मेरा भाई भी रहता है। = వేణు నివసించు ఇంటియందే నా సహోదరుడుకూడ నివసించుచున్నాడు

जिनकी आँखें छोटी होती हैं, वे बडे सुंदर होते हैं। = కండ్లు చిన్నవిగనుండువారు అందముగ నుండెదరు.

जिनपर यह इलजाम लगाते हो, वे बिलकुल निर्दोषी हैं। = ఈ అపరాధమును ఎవరిపై మోపుచున్నావో వారు నిర్దోషులు.

जिनमें नमक नहीं हैं, वे चीजें फीकी होती है। = ఉప్పులేని వస్తువులు రుచికరముగ నుండవు.

## जा, का विशेष प्रयोग

| वर्तमानकाल | भविष्यतकाल | भूतकाल |
|---|---|---|
| जाता है = పడుచున్నది | जायगा = పడును | गया = పడెను |
| जाते हैं = పడుచున్నవి. | जायेंगे = పడును | गये = పడినవి. |
| जाती है = పడుచున్నది. | जायगी = పడును | गयी = పడెను |
| जाती हैं = పడుచున్నవి. | जायेंगी = పడును | गयीं = పడినవి. |

పైఁ జెప్పిన అర్థములో వచ్చునపుడు ఇవి ఎప్పుడును భూతకాల క్రియతోనే వచ్చును. ఇది హిందీభాషలో ఒక విశేషమైన ప్రయోగము

यह काम किया जाता है। = ఈ పని చేయబడుచున్నది.
दस फल खाये जाते हैं। = పది పండ్లు తినబడుచున్నవి.
चिट्ठी लिखी जाती है। = జాబు వ్రాయబడుచున్నది
चिट्ठियाँ लिखी जाती हैं। = జాబులు వ్రాయబడుచున్నవి.
यह काम किया जायगा। = ఈ పని చేయబడును.
दस फल खाये जायेंगे। = పది పండ్లు తినబడును
चिट्ठी लिखी जायगी। = జాబు వ్రాయబడును.
चिट्ठियाँ लिखी जायेंगी। = జాబులు వ్రాయబడును.
यह काम किया गया। = ఈ పని చేయబడెను.
दस फल खाये गये। = పది పండ్లు తినబడెను
चिट्ठी लिखी गयी। = జాబు వ్రాయబడెను
चिट्ठियाँ लिखी गयीं। = జాబులు వ్రాయబడినవి.
यह काम किया गया है। = ఈ పని చేయబడియున్నది
यह काम किया गया था। = ఈ పని చేయబడియుండెను
यह काम किया गया होगा। = ఈ పని చేయబడి యుండవచ్చును
दस फल खाये गये हैं। =పది పండ్లు తినబడియున్నవి.
दस फल खाये गये थे। = పదిపండ్లు తినబడియుండినవి.
दस फल खाये गये होंगे। = పదిపండ్లు తినబడియుండవచ్చును
चिट्ठी लिखी गयी है। =జాబు వ్రాయబడియున్నది
चिट्ठी लिखी गयी थी। = జాబు వ్రాయబడియుండెను.
चिट्ठी लिखी गयी होगी। = జాబు వ్రాయబడియుండవచ్చును.

चिट्ठियाँ लिखी गयी हैं। = జాబులు వ్రాయబడియున్నవి
चिट्ठियाँ लिखी गयी थीं। = జాబులు వ్రాయబడియుండినవి.
चिट्ठियाँ लिखी गयी होंगी। = జాబులు వ్రాయబడియుండవచ్చును

పైఁ జెప్పిన ఉదాహరణములయందు किया, खाये, लिखी మొదలైన భూతకాల క్రియలలోనే जाता है, जायगा, गया మొదలైన క్రియలు వచ్చుటను గమనింపుము.

## और भी कुछ उदाहरण

रुपया इन्ही दिनों के लिये तो जमा किया जाता है। = రూపాయలు ఈ దినమునకుదా చేర్చబడుచున్నది.

उसकी जेब में रुपये डाल दिये जाते हैं। = వాని జేబిలో రూపాయలు వేయబడుచున్నవి

उत्तर भारत में दीवाली धूम धाम से मनायी जाती है। = ఉత్తర హిందూస్థానములో దీపావళి పండుగ ఆడంబరముగా కొనియాడబడుచున్నది.

इस प्रश्न पर आगे विचार किया जाएगा। = ఈ ప్రశ్న గురించి పిదప ఆలోచించబడును

आप ही के प्रस्ताव पर विचार किया गया। = మీ యొక్క తీర్మానమును గురించియే యోచించబడెను.

इस दिन शाही घोडे खूब सजाये गये। = ఈ దినము రాజుగారి గుఱ్ఱములు బాగుగా అలంకరించబడినవి.

क्या शांता सचमुच आश्रम में लायी गयी? = శాంత నిజముగా ఆశ్రమమునకు తీసికొనిరాబడినదా?

वह शाहजहाँ के आल्बम से लिया गया है। = అది " షాజహాను " యొక్క ఆల్బమ్ నుండి ఎత్తబడియున్నది

व्याख्यान में उनका महत्व वर्णन किया गया था। = వ్యాఖ్యానములో వారి మహాత్వము వర్ణింపబడియుండెను.

इसका दोष उनके सिर मढा जाता था। = దీని తప్పు వారిపై మోపబడవలసివచ్చెను

उस समय में भी दीवाली टीमटाम से मनायी जाती थी। = ఆ కాలములో కూడ దీపావళి పండుగ ఆడంబరముగా కొనియాడబడుచుండెను

ఈ ప్రయోగములో ఆసన్న, పూర్ణ, సందిగ్ధ ఈ మూడు కాలములకు మాత్రము गया కు బదులుగా हुआ కూడ ఉపయోగింపవచ్చును.

यह काम किया हुआ है। = ఈ పని చేయబడియున్నది

दस फल खाये हुए हैं। = పది పండ్లు తినబడియున్నవి.

चिट्ठी लिखी हुई है। = జాబు వ్రాయబడియున్నది

चिट्ठियाँ लिखी हुई हैं। = జాబులు వ్రాయబడియున్నవి

वह मंदिर बनाया हुआ था। = ఆ గుడి కట్టబడియుండెను

ये पुल बनाये हुए थे। = ఈ వంతెనలు కట్టబడియుండినవి

यह इमारत बनायी हुई थी। = ఈ భవనము కట్టబడియుండెను

वे इमारतें बनायी हुई थीं। = ఆ భవనములు కట్టబడియుండినవి

खेत बेचा हुआ होगा। = నేల అమ్మబడి యుండవచ్చును.

खेत बेचे हुए होंगे। = నేలలు అమ్మబడియుండవచ్చును

पुस्तक लायी हुई होगी। = పుస్తకము తీసికొనబడియుండవచ్చును.

पुस्तकें लायी हुई होंगी। = పుస్తకములు తీసికొనబడియుండవచ్చును

मेज़ पर नया कपड़ा रखा गया है।
मेज़ पर नया कपड़ा रखा हुआ है। } మేజాపై క్రొత్తబట్ట యుంచబడియున్నది.

ये घर खूब सजाये गये हैं।
ये घर खूब सजाये हुए हैं। } ఈ యిండ్లు బాగుగా అలంకారము చేయబడియున్నవి

अच्छा प्रबंध किया गया था।
अच्छा प्रबंध किया हुआ था। } మంచి యేర్పాటు చేయబడి యుండెను.

मीठे मीठे पद रचे गये थे।
मीठे मीठे पद रचे हुए थे। } చాల సొంపైన పాటలు రచింపబడి యుండెను

दूध गरम किया गया होगा।
दूध गरम किया हुआ होगा। } పాలు వేడిచేయబడి యుండవచ్చును

उसमें चीनी मिलायी गयी होगी।
उसमें चीनी मिलायी हुई होगी। } దానిలో పంచదార చేర్చబడి యుండవచ్చును.

ఈ విశేషప్రయోగమైన जा అను ధాతువు కర్మణి ప్రయోగములోకూడ కర్మననుసరించి వచ్చును, కర్తరి ప్రయోగములో కర్తననుసరించి క్రియవచ్చును. కర్తరి ప్రయోగములో వచ్చు కర్తతో से చేర్చి, వర్తమాన " భవిష్యత్తు " క్రియను భూతకాలముగా మార్చి దానితో ఈ విశేష ప్రయోగమైన जा అను ధాతువుచేర్చిన కర్మణి ప్రయోగమగును.

## कर्तरि प्रयोग ( कर्तृवाच्य )

### కర్తరి ప్రయోగము

वह दूध पीता है। = అతడు పాలు త్రాగుచున్నాడు.
वे भात खाते हैं। = వారు అన్నము తినుచున్నారు.

यह दो खत लिखता है। = ఇతడు రెండు ఉత్తరములను వ్రాయు
చున్నాడు.

ये घोडे खरीदते हैं। = వీరు గుఱ్ఱములను కొనుచున్నారు.

सुगुना कहानी पढ़ती है। = సుగుణ కథ చదువుచున్నది.

केशव घडियाँ देखता है। = కేశవుడు గడియారములను చూచు
చున్నాడు.

वे दान देते थे। = వారు దానమిచ్చుచుండిరి.

ये बहुत रुपये कमाते थे। = వీరు చాల డబ్బు సంపాదించుచుండిరి.

मैं भजन गाऊँगा। = నేను భజన కీర్తన పాడెదను.

तुम ये काम करोगे। = నీవు ఈ పనులను చేయుదువు

हम कुश्ती लडेंगे। = మేము కుస్తీ పట్టెదము.

आप रोटियाँ बनायेंगे। = తమరు రొట్టెలను కాల్చెదరు

उसने कुत्ता मारा। = అతడు కుక్కను కొట్టెను

धोबी ने कपडे धोये। = చాకలివాడు బట్టలను ఉతికెను.

इसने देहली देखी। = ఇతడు ఢిల్లీని చూచెను.

बलराम ने मिठाइयाँ खायीं। = బలరాముడు మిఠాయిలను తినెను.

## कर्मणि प्रयोग (कर्मवाच्य)

### కర్మణి ప్రయోగము

उससे दूध पिया जाता है। = అతనిచే పాలు త్రాగబడుచున్నది.

उनसे भात खाया जाता है। = వారిచే అన్నము తినబడుచున్నది.

इससे दो खत लिखे जाते हैं। = ఇతనిచే రెండు జాబులు వ్రాయ
బడుచున్నవి

इनसे घोडे खरीदे जाते हैं। = వీరిచే గుఱ్ఱములు కొనబడుచున్నవి.

सुगुना से कहानी पढ़ी जाती है। = సుగుణచే కథ చదువ బడు
చున్నది.

केशव से घड़ियाँ देखी जाती हैं। = కేశవునిచే గడియారములు
చూడబడుచున్నవి

उनसे दान दिया जाता था। = వారిచే దానము చేయబడుచుండెను

इनसे बहुत रुपये कमाये जाते थे। = వీరిచే చాల డబ్బు సంపా
దింపబడుచుండెను

मुझसे भजन गाया जायगा। = నాచే భజన కీర్తన పాడబడును.

तुमसे ये काम किये जायेंगे। = నీచే ఈ పనులు చేయబడును

हमसे कुश्ती लड़ी जायगी। = మాచే కుస్తీ పట్టబడును

आपसे रोटियाँ बनायी जायेंगी। = తమచే రొట్టెలు కాల్చబడును.

उससे कुत्ता मारा गया। = అతనిచే కుక్క కొట్టబడెను.

धोबी से कपड़े धोये गये। = చాకలిచే బట్టలు ఉతుకబడెను.

इससे देहली देखी गयी। = ఇతనిచే ఢిల్లీ చూడబడెను

बलराम से मिठाइयाँ खायी गयीं। = బలరామునిచే మిఠాయి తిన
బడెను

పైన జెప్పిన ఉదాహరణములందు కర్తరి ప్రయోగములో కర్త ననుసరించి క్రియ వచ్చుటను. కర్మణి ప్రయోగములో కర్తతో से వచ్చుటను క్రియ భూతకాలముగా మార్చి వచ్చుటను ఆ భూతకాలిక క్రియతో ఈ విశేష ప్రయోగమైన जा అను ధాతువు కర్మననుసరించి వచ్చుటను గమనింపుము.

ఈ విశేష ప్రయోగమైన जा అను ధాతువు గలను, గలదు అను అర్థములో కూడ सक కు బదులుగాకూడ వచ్చును. దీనికి ఉదాహరణము ప్రక్క పేజీలో గమనింపుము.

## सक का प्रयोग

"सक" అనగా "గల" అని అర్థము. దీనిని
यह नह[illegible]డు ధాతువులతోనే చేర్చవలయును. ఇది సకర్మకముగా
यह मछली न[illegible] [illegible]క్యములలో వచ్చునప్పుడు కర్తతో
राजू यह नहीं कर सकता था। = రాజు ఇది [illegible]
ये कुत्ते नही मार सकते थे। = వీరు కుక్కలను చంపలేకుండిరి.
मै बोल नहीं सकूँगा। = నేను మాటలాడలేను.
तुम छतरी नही पकड सकोगे। = నీవు గొడుగును పట్టలేవు
हम सो नहीं सके। = మేము నిద్రించలేకపోతిమి.
वे कपडे नही बेच सके। = వారు బట్టలను అమ్మలేకపోయిరి
आप बात नही सुन सके। = తమరు విషయమును వినలేకపోతిరి
ये गायें नहीं खरीद सके। = వీరు గోవులను కొనలేకపోయిరి.
मै नही बैठता। = నేను కూర్చొనను.
वह नहीं बैठेगा। = అతడు కూర్చొనడు.
यह नहीं बैठा। = ఇతడు కూర్చొనలేదు.

## कर्मणि प्रयोग (कर्मवाच्य)

### కర్మణి ప్రయోగము

उससे नही देखा जाता। = అతనిచే చూడబడజాలదు.
इससे मछली नहीं खायी जाती। = ఈమెచే చేప తినబడజాలదు.
राजू से यह नहीं किया जाता था।=రాజుచే ఇది చేయబడలేకపోయెను
इनसे कुत्ते नहीं मारे जाते थे। = వీరిచే కుక్కలు చంపబడజాలదు.
मुझ से बोला नहीं जायगा। = నాచే మాటలాడబడజాలదు
तुमसे छतरी नहीं पकडी जायगी। = నీచే గొడుగు పట్టబడజాలదు

यह काम पर शामिल हो सकता है। = ఇతడు పనిలో చేరవచ్చును.
वे यहाँ ठहर सकते हैं। = వారిచ్చట బసచేయవచ్చును.
वे इसमें भाग ले सकते हैं। = వీరు ఇందు పాల్గొనవచ్చును
आप अभी यह देख सकते हैं। = తమరిప్పుడే దీనిని చూడవచ్చును.

## चुक, का प्रयोग

"चुक" అనగా "ముగించు" అని అర్థము. దీనిని కూడ ధాతువులతోనే చేర్పవలయును. ఇది సకర్మకముగా నుండినప్పటికిన్ని కర్తతో "ने" రాదు.

मै पौ फटने के पहले ही नहा चुकता हूँ। = సూర్యోదయమునకు మునుపే నేను స్నానము చేసివేయుచున్నాను.
तुम वादे के अनुसार कर चुकते हो। = నీవు మాటప్రకారము చేసివేయుచున్నావు.
वह थकान के कारण सो चुकता है। = అతడు అలసటచే నిద్రించుచున్నాడు.
यह क्रोध से बाहर निकल चुकती है। = ఈమె కోపముచే బయటికి వచ్చివేయుచున్నది.
मै वादे के अनुसार कर चुकूँगा। = నేను మాటప్రకారము చేసివేసెదను.
तुम पौ फटने के पहले ही नहा चुकोगे। = నీవు తెల్లవారక మునుపే స్నానము చేసివేసెదవు.
वह क्रोध से बाहर निकल चुकेगा। = అతడు కోపముచే వెలుపల వచ్చివేయును.

यह थकान के कारण सो चुकेगी। = ఈమె, అలసటచే నిద్రించును
मै थकान के कारण सो चुका। = నేను అలసటచే నిద్రించితిని,
तुम क्रोध से बाहर निकल चुके। = నీవు కోపముచే వెలుపలికివెళ్ళితివి.
वह पौ फटने के पहले ही नहा चुका। = అతడు తెల్లవారకమునుపే
స్నానము చేసివేసెను
वह वादे के अनुसार कर चुकी। = ఈమె చెప్పిన ప్రకారము
చేసివేసెను
माँ बाप दोनों मर चुके हैं। = తల్లి తండ్రులిద్దరు చనిపోయి
యున్నారు.
उसका हाल भी देख चुका। = అతని పరిస్థితికూడ చూచి వేసితిని
एक महीना बीत चुका था। = ఒక నెల గడచి పోయెను.

## नित्यता बोधक

నిత్యతాబోధకము ప్రతిరోజు వాడుకగా చేయునట్టి వంటి పనిని గుర్తించును ఈ వాడుకను సూచించుటకు భూతకాలిక క్రియతో कर అను ధాతువును చేర్చవలయును. ఈ నిత్యతాబోధక వాక్యమునందు కర్త పుంలింగ బహువచనముగా నుండినను లేక స్త్రీలింగ ఏకవచనము, బహువచనముగా నుండినను మొదటి సామాన్య భూతకాలిక క్రియ మారుట లేదు. కాని వాడుకను సూచించు कर అను ధాతువు కర్తననుసరించి మారుచుండును.

मै सांझ सवेरे भगवान की पूजा किया करता हूँ। = నేను ఉదయమున, సాయంత్రమున భగవంతుని పూజిస్తూ ఉంటాను

मेरा दोस्त सदा मेरे साथ रहा करता है। = నా స్నేహితుడు ఎల్లప్పుడు నాతో ఉంటూ ఉంటాడు.

पति भी स्त्री की इच्छित चीजें लाया करते हैं। = భర్త కూడ భార్య కోరిన వస్తువులు తెస్తూ ఉంటాడు.

वे मोटरों में बैठ कर होटलों के चक्कर काटा करते हैं। = వారు బస్సులలో కూర్చొని హోటళ్లకు తిరుగుతూ ఉంటారు

यह युवती भावपूर्ण संगीत गाया करती है। = ఆ యువతి భావగర్భితముగ సంగీతము పాడుతూ ఉంటుంది.

यह औरत नल पर झगड़ा किया करती है। = ఈ స్త్రీ కొళాయి దగ్గర జగడము వేస్తూ ఉంటుంది

यह काम उसका नौकर किया करता था। = ఈ పని అతని నౌకరు చేస్తూ ఉండేవాడు.

बीरबल उनके सवालों का अच्छा जवाब दिया करता था। = బీర్ బల్ వారి ప్రశ్నలకు మంచి జవాబులు ఇచ్చు చుండెడివాడు.

गान्धी रोज बकरी का दूध पिया करते थे। = గాంధీగారు రోజును మేకపాలు త్రాగుచుండెడివారు.

ऐसे ही विचार उसके मन में आया करते थे। = ఇటువంటి అభిప్రాయములు అతని మనస్సునందు వచ్చుచుండెడివి.

विमला रोज नहाने के लिये नदी पर जाया करती थी। = విమల రోజును స్నానముచేయుటకు నదికి పోవుచుండెడిది.

जया महीने में एक बार मेरे घर आया करती थी। = జయ నెలకు ఒకసారి నా ఇంటికి వచ్చుచుండెడిది.

---

## नित्यता बोधक में विधि

तू भगवान की पूजा किया कर। }
तुम भगवान की पूजा किया करो। } నీవు భగవంతుని పూజించుచుండుము.

तू देश की सेवा किया कर। }
तुम देश की सेवा किया करो। } నీవు దేశసేవ చేయుచుండుము.

तू बड़ों का आदर सत्कार किया कर। }
तुम बड़ों का आदर सत्कार किया करो। } నీవు పెద్దలను గౌరవించుచుండుము

तू माँ बाप का प्यार किया कर। }
तुम माँ बाप का प्यार किया करो। } నీవు తల్లి తండ్రులను ప్రేమించుచుండుము

आप भगवान की पूजा किया कीजिये। = తమరు భగవంతుని పూజించుచుండుడు.

आप देश की सेवा किया कीजिये। = తమరు దేశసేవ చేయుచుండుడు

आप बड़ों का आदर सत्कार किया कीजिये। = తమరు పెద్దలను గౌరవించుచుండుడు

आप माँ बाप का प्यार किया कीजिये। = తమరు తల్లి తండ్రులను ప్రేమించుచుండుడు.

तू, तुम, आप కు గల భేదాను గమనింపుడు. మనకంటె చాలతక్కువ వయస్సుగల వారిని గుర్తించునపుడు तू ఉపయోగించవలయును. మనకు సమమైన వయస్సుగల వారిని గుర్తించునపుడు तुम ఉపయోగించవలయును మనకంటె అధిక వయస్సుగలవారినిగుర్తించునపుడు आप ఉపయోగించవలయును.

## संयुक्त क्रिया

ఒక క్రియ ఇంకొక క్రియతో చేరునపుడు ఆ క్రియను సంయుక్త క్రియ అని చెప్పెదము. హిందీయందు ले, डाल, दे, जा, पड़ మొదలగునవి సంయుక్త క్రియలుగా ఉపయోగించెదరు. ఈ సంయుక్త క్రియలను క్రియల అర్థమును నొక్కి చెప్పుటకు

ఉపయోగించెదము. పై సంయుక్త క్రియలలో దే, డాల, లే మొదలగు క్రియలు సకర్మక క్రియలు. కాని ఇవి వాక్యమునందు వచ్చునపుడు కర్తతో "ने" ప్రత్యయము చేర్చవలయును మిగిలిన जा, पड़ మొదలగు క్రియలు అకర్మక క్రియలు, కాని ఇవి వాక్యమునందు వచ్చునపుడు "ने" చేర్చకూడదు.

## दे, का प्रयोग

मै अभी इनकार कर देता हूँ। = నే నిప్పుడే తిరస్కరించివేయు చున్నాను.

तुम भिखारी को निकाल देते हो। = నీవు బిచ్చగాని నెట్టివేయు చున్నావు

वह अच्छा मौका छोड़ देता है। = అతడు మంచి సమయమును వదలివేయుచున్నాడు.

यह उसे खिलौना दे देती है। = ఈమె అతనికి బొమ్మను ఇచ్చి వేయుచున్నది

वे मुझे पैसा दे देते हैं। =వారు నాకు డబ్బు ఇచ్చివేయుచున్నారు.

मै भिखारी को निकाल दूँगा। = నేను బిచ్చగాని నెట్టివేసెదను

तुम अभी इनकार कर दोगे। = నీ విప్పుడే తిరస్కరించి వేసెదవు.

वह उसे खिलौना दे देगा। =అతడు అతనికి బొమ్మ ఇచ్చి వేయును

यह अच्छा मौका छोड देगी। = ఈమె మంచి సమయమును వదలి వేయును

वे मुझे पैसा दे देंगे। = వారు నాకు డబ్బ ఇచ్చివేయుదురు

मै ने अच्छा मौका छोड़ दिया। = నేను మంచి సమయమును వదలి వేసితిని

तुम ने भिखारी को निकाल दिया। = నీవు బిచ్చగాని నెట్టివేసితివి.
उसने अभी इनकार कर दिया। = అతడిప్పుడే తిరస్కరించివేసెను
इसने मुझे पैसा दे दिया। = ఈమె నాకు డబ్బు ఇచ్చివేసెను.
उन्होंने उसे खिलौना दे दिया। = వారు అతనికి బొమ్మను ఇచ్చివేసిరి

## डाल, का प्रयोग

मै खत फाड़ डालता हूँ। = నేను ఉత్తరమును చింపివేయుచున్నాను.
तुम कपड़ा चीर डालते हो। = నీవు బట్టను చింపివేయుచున్నావు.
वह बरतन तोड़ डालता है। = అతడు పాత్రలను పగులగొట్టివేయుచున్నాడు
यह रस्सी काट डालती है। = ఈమె త్రాటిను త్రెంపివేయుచున్నది
वे उसको मार डालते हैं। = వారు అతనిని కొట్టివేయుచున్నారు
मै बरतन तोड डालूँगा। = నేను పాత్రలను పగులగొట్టివేయుదును
तुम खत फाड डालोगे। = నీవు ఉత్తరమును చింపివేసెదవు
वह कपडा चीर डालेगा। = అతడు బట్టను చింపివేయును
यह उसको मार डालेगी। = ఈమె అతనిని కొట్టివేయును
वे रस्सी काट डालेंगे। = వారు త్రాటిని త్రెంపివేయుదురు
मै ने कपडा चीर डाला। = నేను బట్టను చింపివేసితిని.
तुम ने रस्सी काट डाली। = నీవు త్రాటిని త్రెంపి వేసితివి
उसने उसको मार डाला। = అతడు అతనిని కొట్టివేసెను
इसने बरतन तोड़ डाला। = ఈమె పాత్రలను పగులగొట్టివేసెను
उन्होंने खत फाड डाला। = వారు ఉత్తరమును చింపివేసిరి.

## ले, का प्रयोग

मै एक गुडिया ले लेता हूँ। = నే నొక గుడ్డతో చేసిన బొమ్మను తీసికొనుచున్నాను.

तुम रहस्य जान लेते हो। = నీవు రహస్యమును తెలిసికొను చున్నావు.

वह कद् आइना ले लेता है। = అతడు నిలువుటద్దమును తీసికొను చున్నాడు.

यह अच्छी घडी ले लेती है। = ఈమె మంచి ఘడియారమును తీసికొనుచున్నది.

वे कालीन ले लेते हैं। = వారు కంబళిని తీసికొనుచున్నారు.

मै कद् आइना ले लूँगा। = నేను నిలువుటద్దమును తీసికొనెదను.
तुम एक गुडिया ले लोगे। = నీవు ఒక గుడ్డతో చేసిన బొమ్మను తీసికొనెదవు.

वह कालीन ले लेगा। = అతడు కంబళిని తీసికొనును.
यह रहस्य जान लेगी। = ఈమె రహస్యమును తెలిసికొనును.
वे अच्छी घडी ले लेगे। = వారు మంచి గడియారమును తీసికొందురు.

मै ने रहस्यय जान लिया। = నేను రహస్యమును తెలిసికొంటిని.
तुम ने कद् आइना ले लिया। = నీవు నిలువుటద్దమును తీసికొంటివి.
उसने गुडिया ले ली। = అతడు బట్టతో చేసిన బొమ్మనుతీసికొనెను.
इसने कालीन ले लिया। = ఈమె కంబళిని తీసికొనెను.
उन्होने अच्छी घडी ले ली। = వారు మంచి గడియారమును తీసికొనిరి.

## जा, का प्रयोग

मै मंजिल से गिर जाता हूँ। = నేను మేడనుండి పడిపోవుచున్నాను
तुम हाथ छोड जाते हो। = నీవు చేతిని వదలివేయుచున్నావు
वह जल्दी लौट जाता है। = అతడుశీఘ్రముగా తిరిగివచ్చివేయు చున్నాడు.
यह भीड में घुस जाती है। = ఈమె గుంపులో ప్రవేశించుచున్నది.
वे बुलाये बिना आ जाते हैं। = వారుపిలువకయే వచ్చివేయుచున్నారు.
मै जल्दी लौट जाऊँगा। = నేనుశీఘ్రముగా తిరిగివచ్చివేయుదును.
तुम मंजिल से गिर जाओगे। = నీవు మేడపైనుండి పడిపోవుదువు.
वह बुलाये बिना आ जायगा। = అతడు పిలువకయే వచ్చి వేయును
यह हाथ छोड जायगी। = ఈమె చేతిని వదలివేయును
वे भीड में घुस जायेंगे। = వారు గుంపులో ప్రవేశించెదరు.
मै हाथ छोड गया। = నేను చేతిని వదలివేసితిని
तुम जल्दी लौट गये। = నీవు శీఘ్రముగా తిరిగి వచ్చివేసితివి.
वह भीड में घुस गया। = అతడు గుంపులో ప్రవేశించెను.
यह मंजिल से गिर गयी। = ఈమె మేడపైనుండి పడిపోయెను
वे बुलाये बिना आ गये। = వారు పిలువకయే వచ్చివేసిరి.

## पड, का प्रयोग

मै पेड पर से गिर पडता हूँ। = నేను చెట్టుపైనుండి పడిపోవుచున్నాను.
तुम उसे देख कर रो पडते हो। = నీవు అతనిని చూచి ఏడ్చు చున్నావు.
वह ऊपर से कूद पडता है। = అతడుపైనుండి దుమికివేయుచున్నాడు.

यह अन्दर घुस पडती है। = ఈమె లోపల ప్రవేశించుచున్నది
वे शत्रुओं पर टूट पडते हैं। = వారు శత్రువులపై విరుచుకపడు
చున్నారు.

मै ऊपर से कूद पड़ूँगा। = నేను పైనుండి దుమికెదను
तुम पेड पर से गिर पडोगे। = నీవు చెట్టుపైనుండి పడిపోవుదువు
वह उसे देख कर रो पडेगा। = అతడు అతనిని చూచి ఏడ్చును.
यह शत्रुओं पर टूट पडेगी। = ఈమె శత్రువులపై విరుచుకపడును.
वे अन्दर घुस पडेंगे। = వారు లోపల ప్రవేశించెదరు
मै उसे देख कर रो पडा। = నేనతనిని చూచి ఏడ్చితిని.
तुम ऊपर से कूद पडे। = నీవు పైనుండి దుమికివేసితివి.
वह शत्रुओं पर टूट पडा। = వాడు శత్రువులపై విరుచుకపడెను.
यह पेड पर से गिर पडी। = ఈమె చెట్టుపైనుండి పడిపోయెను.
वे अन्दर घुस पडे। = వారు లోపల ప్రవేశించిరి.

## संयुक्त क्रिया में विधि

तुम दे दो। = నీవిచ్చివేయుము
तुम डाल दो। = నీవు వేసివేయుము
तुम ले लो। = నీవు తీసికొనుము.
तुम लौट जाओ। = నీవు తిరిగి పొమ్ము.
तुम गिर पडो। = నీవు పడిపొమ్ము.
आप देदीजिये। = తమరిచ్చివేయుడు
आप डाल दीजिये। = తమరు వేసివేయుడు
आप ले लीजिये। = తమరు తీసికొనుడు
आप लौट जाइये। = తమరు తిరిగిపొండు.
आप गिर पडिये। = తమరు పడిపొండు

సామాన్యభూతకాల క్రియతో దే, డాల అను సంయుక్త క్రియలను చేర్చిన పని వెంటనే జరుగుచుండుటను గుర్తించును.

जा, रह అను సంయుక్తక్రియలను చేర్చిన పని విడువక జరుగుచుండుటను గుర్తించును.

గమనిక.— ఈసామాన్య భూతకాలక్రియ ఎల్లప్పుడును పుంలింగ బహువచనముగనుండును.

## उदाहरण

मै खत लिखे देता हूँ। }
मै खत लिखे डालता हूँ। } నేను ఉత్తరమును వ్రాసివేయుచున్నాను.

मै रुपये भेजे देता हूँ। }
मै रुपये भेजे डालता हूँ। } నేను రూపాయలనుపంపివేయుచున్నాను

तुम आगे बढ़े जाओ। = నీవు ముందుకు సాగుతూ ఉండుము

तुम काम किये जाओ। = నీవు పనిని చేయుచునే ఉండుము.

तुम मनमाना बके रहो। = నీవు యిష్టమువచ్చినట్లు మొరుగుచూ ఉండుము.

चुपके चुपके किये जाता है। = మౌనముగ పనిని చేయుచునే ఉన్నాడు.

స్థూలాక్షరములలోయుండు క్రియలు బహువచనముగ నుండుటను గమనింపుము.

---

## लग, का प्रयोग

" लग " అను ధాతువునకు " ఆరంభించు " అని అర్థము దీనిని ధాతువులతో " ने " చేర్చిన పిదప ఉప

యోగించవలయును. ఇది అకర్మక క్రియగానుండుటవలన కర్తతో "ने" రాదు.

मै सोने लगता हूँ। = నేను నిద్రించ నారంభించుచున్నాను
तुम बोलने लगते हो। = నీవు మాటలాడ నారంభించుచున్నావు.
वह गाने लगता है। = అతడు పాడ నారంభించుచున్నాడు.
यह नाचने लगती है। = ఈమె నాట్యమాడ నారంభించుచున్నది.
वे हँसने लगते हैं। = వారు నవ్వ నారంభించుచున్నారు.

मै सोने लगूँगा। = నేను నిద్రించ నారంభించెదను
तुम बोलने लगोगे। = నీవుమాటలాడ నారంభించెదవు.
वह गाने लगेगा। = అతడు పాడ నారంభించును.
यह नाचने लगी। = ఈమె నాట్యమాడ నారంభించును.
वे हँसने लगेंगे। = వారు నవ్వ నారంభించెదరు

मै सोने लगा। = నేను నిద్రించ నారంభించితిని
तुम बोलने लगे। = నీవు మాటలాడ నారంభించితివి
वह गाने लगा। = అతడు పాడ నారంభించెను.
यह नाचने लगेगी। = ఈమె నాట్యమాడ నారంభించెను.
वे हँसने लगे। = వారు నవ్వ నారంభించిరి.

## पड, लग, का विशेष प्रयोग

पड़, लग అను ధాతువులకు సహజ అర్థము పైన నివ్వబడి యున్నది. కాని వీటికి గుర్తించిన అర్థము చెప్పుటకు వీలుకాదు. ఎట్లు మనకండ్లు మనకు శోభనిచ్చుచున్నవో అట్లే ఈ ధాతువులు హిందీభాషకు శోభనిచ్చుచున్నవి. ఈ రెండుధాతువుల

4187

# सन्त नन्दनार



"नन्दनार की अग्नि-परीक्षा"